


# మధుపూరితమైన పాలు -అది మిల్క్‌మేడ్




'మిల్క్‌మేడ్' అసలైన గడ్డపాలు
రిజిష్టర్డ్ ట్రేడ్ మార్కు నెస్లెవారి సృష్టి

నెస్లెస్ మిల్క్‌మేడ్ గడ్డపాలు పూర్తి మీగడ పాలు, శుద్ధి చేయబడిన పంచదార సమృద్ధిగా చేర్చి సిద్ధంగా తయారయేటట్టు మేళవింప బడ్డాయి....టీ కాఫీలకు ఎంతో రుచికరము పరిశుద్ధమైన మీగడ పాలు కాబట్టి శ్రేష్టమైన తీయని తినుబండారాలు బూరెలు, ఖీరు (పరమాన్నము) బర్ఫీ, వగైరాలు తయారుచేసుకోవచ్చు. మంచి గుమ్మ పాల రుచితో గుమగుమలాడుతూ వుంటాయి-చక్కెరకు అదనంగా ఖర్చువుండదు.

A, D, విటమినులు పుష్కలంగా వుండటంచేత మామూలు పాలకంటె మిల్క్‌మేడ్ ఉత్తమమైనవి. పెరుగుతూన్న మీ పిల్లలకు కావలసిన పుష్టినిస్తూ శక్తి సామర్థ్యాలను కలిగిస్తుంది. నిరపాయకరమై పరిశుద్ధమై తాజాగా సౌకర్యంగా వుంటాయి. ఒకవంతు మిల్క్‌మేడ్‌కు రెండు వంతుల నీళ్లు కలిపితే ఒక డబ్బాకు సుమారు 1 లిటరు చిక్కని తీయని పాలు తయారవుతాయి. మీ పాలు పంచదార సమస్యలకు పరిష్కారమే–మిల్క్‌మేడ్.

NPI-5355 R

# ఉత్తరాలు

## కథలు

'అద్దెకిచ్చిన హృదయం' అన్న కథనికలో ఇద్దరు ప్రవాసాంధ్రులు, గథే, మాథాని, ప్రొఫెసర్ పాత్రలు రచయిత రచనావ్రుతంతో ప్రాణం పోసుకుని పాఠకుడి హృదయంలో అమరంగా నిలిచిపోతాయి. ఇందులో వ్యక్తమయే 'మనిషి మరో మనిషికి మధ్య అల్లుకుపోయే మమతానుబంధానికి భాష ప్రాంతం ఎప్పుడూ అడ్డుగోడగా నిలవ' దన్న సందేశం స్రుజనాత్మకమైనది.

కట్టెకోల యాదగిరిరావు, (హైదరాబాదు)

## సీరియల్

మాతమ్ముడు నాగేశ్వరరావు వ్రాసిన వుత్తరం చదివేను. మాతాతగారి యింట్లో శుచి శుభ్రతలకు లోటు లేక పోయినా హైదరాబాదులో పెరిగిన మమ్మల్ని చాలా అపురూపంగా చూసేవారు. హైదరాబాద్ మీద వాళ్ళకి వున్న అభిమానం కవచ్చు మరేదైనా కావచ్చును. పది పన్నెండేళ్ళ మాతమ్ముడు నాగేశ్వరరవు మిగిలిన తమ్ముళ్ళు కూడా చిరశపూడిలో బెడ్‌కాఫీ త్రాగడం చిన్నతనం కనుక వాళ్ళు మరిచి పోయినా నేనెలా మరిచిపోతాను. సమంజసంగా లేదని రాసేడు. పెద్దయాక బెడ్‌కాఫీసంగతి వాళ్ళు మరిచిపోతే అందుకు కథ విధానాన్ని అనడం న్యాయమేనా?

—శిఖా వెంకటరమణ,

## ముఖచిత్రం

మాకు రంగు రంగులలోవున్న ఈవారం ఆంధ్ర పత్రిక (29.8.69) ముఖచిత్రం రాజశ్రీ బొమ్మ బాగుంది. పత్రికకు చాలా అందాన్ని ఇచ్చిందికూడ. ఈవిధంగా పత్రికకు మంచి ఆకర్షణీయంగాఉండేందుకు, ఇటువంటి రంగురంగుల సినీతారబొమ్మలతో పాటు, ఇతర బొమ్మలు వేయండి. ఒకవారం విపరీతం, కార్టూన్లు ఆనందాన్ని ఇస్తున్నాయి.

——తాదాలరత్నకుమారి, తాదాల సరోజినీదేవి,
తాదాల రాజసులోచన (పిఠాపురము.)

## వ్యాసాలు

తెలంగాణా ఉద్యమము యొక్క తీరుతెన్నులు చూస్తుంటే దేశభక్తుడైన ప్రతివానికి అతడు తెలంగాణీయుడే కాని, ఆంధ్రుడేకాని మిక్కిలి బాధ కల్గుతుంది. ఏడు నెలలుగా సాగుతున్న ఉద్యమము వలన యాభై కోట్ల రూపాయలకు పైగా నష్టమయింది. ఇంకా ఎంత నష్టము జరుగుతుందో చెప్పలేము. ప్రత్యేక తెలంగాణా ఏర్పడవలెనంటే బస్సులను తప్పనిసరిగా కాలబెట్టాలా? దుకాణాలను, హోటళ్లను లూటీ చెయ్యక తప్పదా? రైలు పట్టాలను తప్పనిసరిగా కాలబెట్టాలా? దుకాణాలను, ఊడబెరకడము తప్పనిసరా? ఇవన్ని చేస్తేకాని ప్రత్యేక తెలంగాణా ఏర్పడదా? నగరములో శాంతి భద్రతలకు భంగము కల్గించినపుడు తిరిగి శాంతి భద్రతలను నెలకొల్పుటకై ప్రభుత్వమువారు మిలిట్రీ సహాయము కోరడము తప్పా? దుకాణాలను లూటి చేస్తున్న, బస్సులను తగుల బెడుతున్న, ప్రభుత్వము పోలీసులు చూస్తూ ఊర్కోవలసినదేనా? అలా ఊరుకొనటానికేనా పోలీసుశాఖఉన్నది?

తెలంగాణా వేరు కావాలని కోరే హక్కు నీకున్నది అదే విధముగా తెలంగాణా వేరు కావద్దనే వారికికూడ అలా అనే హక్కు వారికున్నది. నీకున్న హక్కునీవు వినియోగించుకొనినప్పుడు అతని హక్కును అతడు వినియోగించుకొంటున్నాడు. అటువంటప్పుడు సమైక్యతావాదులపై దౌర్జన్యము జరుపడము అవివేక చర్యకాకపోతే మరేమిటి? ఒకరి హక్కులను గౌరవించలేని నీవు నీ హక్కులను వినియోగించుకోవటానికి కూడ నీకు అర్హతలేదు.

సత్యాగ్రహాన్ని మీరు గాంధిగారి పద్ధతులలో జరుపుతుంటిరా? ఎక్కడి శాంతి అహింసలతో కూడుకొన్న గాంధిగారి సత్యాగ్రహము? ఎక్కడి దౌర్జన్య పూరితమీ సత్యాగ్రహము? దారిలో కనబడిన సిటీ బస్సుపై రాళ్లు రువ్వడమే లక్ష్యముగా పెట్టుకొన్న మీ సత్యాగ్రహముతో గాంధిగారి సత్యాగ్రహాన్ని పోల్చకండి.

మీ ఉద్యమానికి ప్రజల మద్దతు ఉన్నదా? పగలంతా శ్రమించి ఒక్క రూపాయి సంపాదించి దానితో కుటుంబాన్ని పోషిస్తున్న పేదప్రజలు, అసలు తెలంగాణా అంటే ఏమిటో ఆంధ్ర అంటే ఏమిటో తెలియని అమాయక ప్రజలు మీ ఉద్యమానికిమద్దతు ఇస్తున్నారా? ఇస్తున్నారని ప్రకటనలు చేయడము ఎంత హాస్యాస్పద విషయము.

ఇకపోతే తెలంగాణా ఏర్పడటానికి విద్యార్థులు పాఠశాలలకు పోకపోవడానికి గల ఘనిష్ఠ సంబంధమేమిటో అర్థమవడములేదు. ప్రత్యేక తెలంగాణా ఏర్పడితే దీనికో ముఖ్యమంత్రి, ఇతర మంత్రులు ఏర్పడతారు. అనగా కొంతమంది రాజకీయ నాయకులకు పదవులు దొరుకుతాయి. మరి విద్యార్థులకు లభించేదేమిటి? "ఉద్యోగాలు" అని జవాబిస్తున్నారు కాని ప్రతి సంవత్సరము వేల విద్యార్థులు కాలేజీనుండి డిగ్రీలు తీసుకొని వస్తుంటారు. ప్రతి సంవత్సరము ఆ వేల మందికి ఈ నాయకులు ఎక్కడి నుంచి ఉద్యోగాలు ఇస్తారు. అతి ధనవంతు దేశమైన అమెరికాలో కూడ నిరుద్యోగ సమస్య ఉన్నది. మన దేశములో కూడ ఉన్నది. మన రాష్ట్రములో కూడ ఉన్నది. మన ప్రాంతములోకూడ ఉన్నది. ప్రత్యేక తెలంగాణా ఏర్పడితే అందరికీ ఉద్యోగాలు ఏర్పడుతాయనేమాట, నిరుద్యోగ సమస్య ఉండదనే మాట జరుగుడు కలలోని విషయము.

తెలంగాణా ఉద్యమానికి వ్యతిరేకముగా వ్రాసే ఉత్తరాలను పత్రికలు ప్రచురించటములేదు. తమ ఆఫీసును, తమ పత్రికలు ఏమిచేస్తారో అన్న అన్న భయముతోనే సంపాదకులు అటువంటి ఉత్తరాలను ప్రచురించటములేదు. ఒకవేళ నా ఉత్తరము ప్రచురించనట్లయితే తెలంగాణ విద్రోహులకు భయపడే ప్రచురించలేదనే నేననుకుంటాను. కావున తప్పక ప్రచురించండి.

బి. రాములు, (జగిత్యాల)

* * *

మనకు పగ్గాలు పోయి రెండు పదులు దాటినా బానిసల బుద్ధి తక్కువైనట్లు లేదు. తెల్లోడు గొప్ప అనేది మన నెత్తురులో ఇంకిపోయింది. ఈ అమెరికా అంతచూసిన. మొగుడి పేరు పెట్టుకున్న ఒక్క ఆడదీ కనపడలే. పెళ్ళికాకముందఖ్ఖ ఇక్కడ ఆడోళ్ళకి మూడు పేర్లుంటయి. ముందటిది ఆమె పేరు, నడిమిది వాళ్ళ అప్పపేరు, ఆఖరుది ఇంటి పేరు. పెండ్లి అయినాక మొగుడి ఇంటిపేరు ఆమె అఖరి పేరవుతది. ఉదా. కుమారి బిల్లి ఎమ్.హోర్డ్ శ్రీ లూయిస్ ఆర్థర్ స్ప్రమర్‌ను పెండ్లి చేసుకుంటే ఆమె బిల్లి ఎమ్. స్ప్రమర్‌గా మారిపోతది. వాళ్ళని ఎవరికన్నా పరిచయము చేస్తే మిస్టర్ అండ్ మిసెస్ స్ప్రమర్ అంటారు. మన తెలుగు దేశంలో ఇంటిపేరు ముందరిపేరని అంతా మర్చిపోయినట్లున్నారు. డబ్బా రేకుల లలిత పంగనామాల రంగనాథం పెళ్ళాం కాగానే లలితా రంగనాథమై కూర్చుంటుంది. కాని ఇక్కడోళ్ళ ఆచారం ప్రకారము మిసెస్. లలితా పంగనామాల లేకపోతే పంగనామాల లలిత ఐతే చాలు.

ఈ నడుమ తమ పేరు వెనక మొగుడి పేరు తగిలిచ్చికోవడము ఒక పెద్ద ఫాషనై పోయింది. సినిమా ఆడోళ్ళు, కథలు రాసేటోళ్ళు.....వారితో పాటు వీర పూజ చేసే జనము. పులిని జూసి నక్క వాత పెట్టుకుందంటారా?

ఆకుల రామేశ్వర్, ఇథక (న్యూయార్క్)

* * *

ఒక పాఠకుడు ప్రెసిడెన్సీ కాలేజి (మదరాసు) కథ ఒకటి చెప్పగా ప్రచురింతారు. పచ్చయప్ప కాలేజి (మదరాసు) గురించి ఒక కథ చెప్తాను. కొన్ని సంవత్సరాలకి మునుపు పాత మదరాసు రాష్ట్రంలో 'కమ్యూనల్ జి. ఒ.' ఒకటి ఉండేది. కాలేజి సీట్లు కులం వగైరాలని బట్టి ఇచ్చేవారన్న మాట. దానిని న్యాయస్థానంలో కొట్టి వేశారు! ఆ సందర్భంలో అప్పటి పచ్చయప్ప కాలేజి ప్రిన్సిపాల్ ఒకాయన విద్యార్థులతో— కమ్యూనల్ జి. ఒ. ఉండాలని గొడవ చెయ్యండని అన్నారు. ప్రిన్సిపాల్‌గరు ఏ కులంవారిని దృష్టిలో పెట్టుకుని కమ్యూనల్ జి. ఒ. తీసుకువచ్చారో ఆ కులానికి చెందినవారు. కాని, కమ్యూనల్ జి. ఒ. కావాలని అలజడి చేసినవారు ఎందరో ఆయన వైఖరిని పొగడారు. ఇంతకీ, ఆయనగారు వారి శ్రేయోభిలాషి అనాలా లేక ఆయన వారిని తక్కువగా చూసేవారు అనాలా? ఈ ప్రశ్నకి సమాధానం ఇన్ని సంవత్సరాలు తర్వాత కూడా నాకు తోచటంలేదు!

ఎ. వి. రావు (ఎన్. కల్లూరు)

* * *

తెలంగాణా భాషలో, తెలంగాణా వీరులు వ్రాస్తున్న బెదిరింపు ఉత్తరాలు మన పత్రికలో ప్రచురించి, తెనుగు భాషకే తీరని అవమానం కలిగించవద్దని మా ప్రవాసాంధ్రుల ముఖ్య కోరిక!

—ప్రవాసాంధ్రులు,
ప్రవాసాంధ్రసంఘం,
——భాగల్‌పూర్. (బీహారు.)

# ఉత్తరాలు

జంగారెడ్డిగూడెం నుంచి పాఠకులు ప్రకాశరావు గారు శ్రీమతి బెనర్జీ ఇచ్చిన అంకెల మొత్తాలు కుదరటం లేదని రాశారు.

శ్రీమతి బెనర్జీ సమాధానం— కొన్ని ప్రాంతీయ పాటశాలలని ప్రభుత్వం వారు 'పూర్తిగా' గుర్తించ లేదు. వీటిని గురించి నేను వివరంగా రాయలేదు. నేను స్వయంగా చూసి వచ్చిన పాఠశాలలని గురించ మాత్రమే రాశాను. వివరాలకి నేను సంప్రదించిన నివేదికలు 1) ది రిపోర్ట్ ఆఫ్ ది సెకండరీ బోర్డ్ ఢిల్లీ 1968—69, 2) ది రిపోర్ట్ ఆఫ్ ది రీజనల్ స్మాల్ స్కూల్ కమిటీ ఢిల్లీ 1966, 1968 మొదలయినవి.

* *

థ్యాంక్యూ వెరీమచ్ సర్! తెలంగాణా సమస్యపై ఉత్తరలు ఆపమని కోరటం వలన మా ఉత్తరాలకి పత్రికలో కాస్త చోటు దొరికేలా చేసారు.

శాస్త్రి కృష్ణవేణి. (కాకినాడ)

* * *

శ్రీ సౌమ్యనామసంవత్సరం శ్రావణ శుద్ధ దశమి శనివారం. సంపాదకులు, ఆంధ్రసచిత్ర వారపత్రిక, మద్రాసు వారికి నమస్కరించి తను వారపత్రికలో ప్రచురించునిమిత్తము సవినయంతో పంపు 'లేఖ'

నారాయణ రెడ్డి, దాశరథి మొదలయినవారు తెలుగు భాషను మరచిపొండి. ముఖ్యంగా వీరిద్దరు ఆంధ్ర సినీ నిర్మాతలకు లాభం చేకూర్చుచున్నారు. అసలు తెలుగులో పత్రికలు ప్రచురింపవద్దు వాటినన్నిటినీ ఇతర భాషల్లో అచ్చువేయండి. ఎక్కడయినా తెలుగులో బోర్డులు వంటివియుండిన వాని నిండా తారు పులమవలయును. ఇంగ్లీషు లేక తెలుగు బోధనా భాషగా యుండుటకు వీలు లేదు. హిందీ లేక ఉర్దూలలో బోధించవలయును. అసలు విద్యార్థులకు తెలుగుభాష బోధింపరాదు. పొరపాటునైనా బమ్మెరపోతన మొదలయినవారిని ఎవ్వరును తలవరాదు. —సి. సుబ్బారావు.

'ఆంధ్ర ద్రావిడ భారతి' (మచిలీపట్నం).

# ఆంధ్రసచిత్ర వారపత్రిక


వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 26 – 9 –'69
శ్రీ సౌమ్యనామ సం॥ భాద్రపద మా. బ. పాడ్యమి
సంపుటము : 62 సంచిక : 3

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26.00 |
| 6 మాసముల చందా | 13.00 |
| 3 మాసముల చందా | 6.50 |


## విషయానుక్రమణిక


ఆగు!
ఫియట్ కారు ధరలు
కేంద్రం
ఈ బోర్డులు ఎవరికో కావాలంట!
వన్ వే ట్రాఫిక్
ఆంప్ర ముఖ్యమంత్రి పదవి
సంఘీభావం
మనం, గుర్రానికి ముందు బండిని కట్టేశాం!
క్రమశిక్షణ
GOMMEH

# కాంగ్రెసు రకం కమ్యూనిజం సృష్టించిందెవరు?

కాంగ్రెసు రకం కమ్యూనిజమ్ సృష్టికర్త ఎవరు? అంటే శ్రీ నీలం సంజీవరెడ్డిగారే అన్నా అతిశయోక్తి కాదు. ఎందుచేతనంటే రాష్ట్రపతి పదవి విషయమై జరిగిన యుద్ధాలు మొదలయ్యేదాకా మేడమ్ ఇందిరాగాంధిగారు భారతదేశంలోని పేదవారి సంగతి అంతగా పట్టించుకోలేదు.

భారతదేశం ఎప్పటినుంచో బీద దేశం. 1901లో విలియమ్ డిగ్బీ అనే అతను ఈ దేశం ఆర్థిక పరిస్థితిని గురించి ఒక పుస్తకం ప్రచురించాడు. 1850 లో భారతదేశంలో రోజుకి తలసరి ఆదాయం 2 పెన్నీలుట (మారకం విలువ మునుపు 2 పెన్నీలు సుమారు 2 అణాలతో సమానం) 1900 లో రోజుకి తలసరి ఆదాయం ముప్పాతిక పెన్నీట. ఫేబియన్ సోషలిజమ్ నాయకులలో ఒకరయిన జార్జి బెర్నార్డ్ షా పేదరికాన్ని ప్రవాదంలోకి తీసుకువచ్చాడు; నేరాలను చూసి భయపడేది బుద్ధిలేనివారే. 'మనం అందరం పేదరికాన్ని చూసి భయపడతా'మన్నాడు ఆయన.

## సోషలిస్టు పార్టీలు

భారత రాజకీయాలలో సోషలిజమ్ అనేమాటకి ప్రాముఖ్యతని ఇచ్చినవారు జవహర్‌లాల్ నెహ్రూ. ఇది వారి ఉపాయాలలో ఒకటి. ఎందుచేతనంటే, జయప్రకాష్ నారాయణవంటివారు సోషలిస్టు పార్టీని పెట్టారు. వారి పార్టీని నాశనం చేసే అవసరం కాంగ్రెసుపార్టీకి కలిగింది. సోషలిస్టులు కొందరు, జవహర్‌లాల్—వల్లభాయిలు కలిసిన కాంగ్రెసులో తమకి స్థానం లేదు కాబట్టి నిజాయితీతో ఆ పార్టీని వదులుకుని తమ స్వంత పార్టీని స్థాపించారు. ఎన్నికలలో సోషలిస్టుపార్టీ కొంత నెగ్గగలిగింది. ఇంకా ఎక్కువ అభివృద్ధి చెందుతుందనే భయంతో పండిత జవహర్‌లాల్ నెహ్రూ కాంగ్రెసులో 'డిమోక్రెటిక్ సోషలిజమ్' అనే మాటకి ప్రచారం వచ్చేట్లు చేశారు. అయితే వారి వ్యక్తిత్వమూ, రాజకీయ దక్షతా మాత్రమే సోషలిజమ్‌కన్నా అధికంగా కాంగ్రెసు విజయానికి తోడ్పడ్డాయి. వారికి రష్యా అంటే అభిమానం. కాని తమకి కమ్యూనిజమ్ విధానాలు నచ్చవని గొంతు చించుకుని అరిచేవారన్నా అతిశయోక్తి కాదు. ఇదంతా మేడమ్ గాంధిగారికి బాగా తెలుసు. వారికి తెలిసినంతగా పార్టీలో ఇతరులకి తెలియదేమో.

## వర్గయుద్ధం

వర్గయుద్ధం అనే భావం కార్ల్ మార్క్సుతో పుట్టిందనవచ్చు. దానిని ఆచరణలోకి పెట్టినవారు లెనిన్. మార్క్సు సిద్ధాంతాలలోకి అతి ముఖ్యమయినవి మూడు—చరిత్రని వాస్తవిక దృష్టితో పరిశీలించటం, పెట్టుబడి పెరుక్ సటం, వర్గయుద్ధం.

రెండవదానిని గురించి కొంత చెప్తాను—పెట్టుబడిదారుల సంస్థలు క్రమంగా పెద్దవి అవుతాయి క్రమంగా పోటీ తగ్గిపోయి చివరికి కొందరు పెద్ద పెట్టుబడిదారులు మాత్రం మిగులుతారు. ఇది జరుగుతూ ఉండగా పెట్టుబడిదారి వర్గాలవారు కొందరు కూడా కార్మిక వర్గాలోకిని తరుముబడుతారు. ఈ పరిస్థితి పరిశ్రమలోనేకాక వ్యవసాయంలో కూడా ఏర్పడుతుందని మార్క్స అన్నారు. చివరికి పెట్టుబడిదారులవర్గం కార్మిక వర్గంతో పోట్లాడి తీరవలసి వస్తుందని ఎదురు చూశారు.

తర్వాత, వర్గయుద్ధం—జీతగాడు—జీతగాడుగానే పెట్టుబడిదారు పెట్టుబడిదారుగానే ఉండిపోతారనే సిద్ధాంతాన్ని మార్క్స్ ప్రతిపాదించారు. పెట్టుబడిదారులు జీతగాళ్లని దుర్వినియోగం చేస్తారు. ఈ దుర్వినియోగం ఫలితంగా కార్మికులకీ, బూర్జువాలకీ మధ్య ఉండే విభేదాలు మరింత అధికం అవుతాయి. చివరికి ఈ విభేదాలు వర్గయుద్ధానికి దారి తీస్తాయి. కార్మికులు ముందు ఒక ప్రాంతంలో, తర్వాత ఒక దేశంలో ఆఖరికి ప్రపంచం అంతటా ఏకమవుతారు. అప్పుడు వారికి విజయం తప్పదు. భూమి, పెట్టుబడి అందరి సొత్తూ అని వారు నిర్ణయిస్తారు. దుర్వినియోగం ఉండదు. పెట్టుబడిదారుల అన్యాయాలు మాయమవుతాయి. రెండు వర్గాలుకాక మానవులంతా కలిసి ఉన్న ఒకే వర్గం ఏర్పడుతుంది.

## జెహాద్

ఇటీవలే ప్రభుత్వం ప్రచారం చేస్తున్న విధానం మార్క్సు సిద్ధాంతాలకి దగ్గిరగా ఉందా? కొందరి చేతులలో ఉన్న ఆర్థికాధికారాన్ని నాశనం చెయ్యాలనే ఉద్యమం ఒకటి ప్రారంభం అయిందనవచ్చు. ఇది ఇంచుమించు ఒక జెహాద్‌ని పోలి ఉంది. అయితే ఇది నిలిచే ఉద్యమమేనా? కాదనే అనుమానం కలగటానికి అవకాశం ఉంది. ఎందుకంటే బిర్లా సంస్థలని శోధించాలనే ప్రతిపాదనని బిర్లాలే మార్పించారు—దేశంలోని పెద్ద వ్యాపార సంస్థలన్నిటినీ శోధించాలనే సూచనని ఆచరణలోకి తీసుకువచ్చారు. అంతేకాదు, శాంతిప్రసాద్ జెయిన్‌గారి కుమారుడిని బెన్నెట్ కాల్‌మన్ కంపెనీకిఅధ్యక్షుడినిగా వెయ్యటం గమనించతగ్గ విషయం. వంటు గది మంత్రివర్గంలో శ్రీ జెయిన్‌కి మంచి గౌరవం ఉందన్నమాట.

## ప్రతిదినం ఉపన్యాసాలు

వర్గయుద్ధం సంగతి వేరు. అది అంత తేలికగా తీసివెయ్యగలిగింది కాదు. ప్రధానమంత్రి ప్రతిదినం కమ్యూనిస్టుల సహాయంతో ఏర్పరిచిన సభలలో పేదరికాన్ని నశింపచెయ్యటాన్ని గురించీ, జాతీయం చెయ్యటం దీనిని ఎలా సాధిస్తుందనే సంగతిని గురించీ ఉపన్యాసాలు ఇస్తున్నారు.

మేడమ్ గాంధిగారు ప్రధానమంత్రి అయి కొన్ని సంవత్సరాలు అయింది. అయితే, దేశంలో పేదరికం వారికి హటాత్తుగా ఇప్పుడే కలిగింది. వారి మంత్రులు పెద్ద కారులు కొనుక్కుంటున్నారు. ఇది కూడా పేదరికాన్ని ఎదిరించటానికి అనుసరించే మార్గమేనా? రాజా దినేష్‌సింగ్ ఆఫీసుగదిని మెరుగుపరచటానికి లక్షరూపాయలదాకా ఖర్చు చేశారుట. ఇంతకి ముందు రాజావారు మరొకశాఖమంత్రిగా ఉన్నప్పుడు వారి గదిమీద రెండు లక్షలు ఖర్చు చేశారు. ఇటువంటి దుబారా ఖర్చులు ఎన్నో ఓపెన్ ఎయిర్ థియేటర్లు, నెహ్రూపార్కులు, ఇవీ అవీ....

## రోజుకి రు. 7.50

ప్రధానమంత్రి ఇంట్లో ఉంటున్నందుకు శ్రీ నెహ్రూ తాము రోజుకి రు. 7.50 తమకూతురు రు. 7.50 ఇచ్చే ఏర్పాట్లు చేసుకున్నారు. ఏర్పాటే ఇంకా సాగుతూ ఉండవచ్చు. ఈ రు. 7.50 కి హారం, ఎక్కటి భవనం, ఉచితాహారం లభిస్తాయి. ఇదంతా పేదరికాన్ని మాపేందుకే. ఒక్క వ్యక్తి ఎందరు కోట్లమంది కళ్లు కట్టగలుగుతున్నారో తలుచుకుంటే ఆశ్చర్యం వేస్తుంది.

బాంకు జాతీయం అకాలంగా చెయ్యబడినదని కొందరు కాంగ్రెసు సభ్యులే అన్నారు కాని సోవియట్ పత్రికలు ఇది చాలా గొప్ప పని అన్నట్లు రాశాయిట. దేశంలోని కమ్యూనిస్టు పత్రికల సంగతి సరేసరి. కాంగ్రెసులో ఉన్న కుడిపక్షంవారికి ఇది పెద్ద దెబ్బ అని వారి అభిప్రాయంట. ఈ పక్షంవారు జనసంఘం స్వతంత్రపార్టీలతో చేరి ప్రభుత్వం అనుసరించే ప్రజాస్వామ్య పరిణామాలని ఎదిరిస్తారుట 'ప్రావ్దా' జులై 24 వ తేదీ ప్రావ్దా పత్రిక ప్రకారం. భారతదేశంలో కుడి—ఎడమ పక్షాల ధ్రువీకరణం, కాంగ్రెసుపార్టీలో సంచలనం గురించి ఈ పత్రిక ఈవిధంగా వ్యాఖ్యానించిందేమోనని పిస్తుంది. 'పురోగమన శక్తులు' ఐకమత్యంతో పని చెయ్యాలనే ఉద్ఘాటన కుడిపక్షాలవారిని ఉద్దేశించి చేసినదే అయినప్పటికీ, అది భారతీయ వామపక్షాలవారిమధ్య ఐకమత్యంకోసం (కేంద్రంలోనూ రాష్ట్రాలలోనూ కూడా) చేసిన ఉద్ఘాటన కూడా అని వర్ణించవచ్చు.

## కాంగ్రెసులో చీలికలు

ఈ రకం వ్యాఖ్యానాలని భారతదేశంలోని సోవియట్ పక్షపాతం వహించే పత్రికలూ, సోవియట్ ప్రచారంచేసే ఇతర సంస్థలూ ప్రచారం చేస్తున్నాయి. కాంగ్రెసులోని చీలికలని తమ ప్రయోజనానికి వాడుకోవాలని కుడి కమ్యూనిస్టుపార్టీకి రష్యా సూచిస్తూ ఉండవచ్చు. అఖిల భారతస్థాయి ఒక వామ పక్షాల ఫ్రంట్‌కి కుడి కమ్యూనిస్టుపార్టీ

నాయకత్వం వహించాలని వారి అభిప్రాయం అయి ఉండవచ్చు. ఇటువంటి ఫ్రంట్‌కి కాంగ్రెసులోని వామపక్షాలవారి మద్దత్తు కూడా ఉంటుంది. దీని అర్థం ఏమిటంటే, కమ్యూనిస్టులు తమకి తాముగా మార్క్సిస్టులతో కలిసినప్పటికీ—కాంగ్రెసుని పడకొట్టలేమనుకుంటున్నారన్నమాట. 1972 ఎన్నికలలో కాంగ్రెసువారిమధ్య చీలికలని తమ ప్రయోజనానికి వాడుకోవాలని మాస్కో కమ్యూనిస్టులు అనుకుంటున్నారన్నమాట. న్యూఢిల్లీ పత్రిక ప్రేటియాట్ మాస్కో విలేఖరి ఇలా రాశారు,—కాంగ్రెసు, కాంగ్రెసు—ఇతర శక్తులమధ్య పెద్ద తేడాలేమీ లేవనీ, కుడిపక్షాలవారి అపజయం ప్రధానమంత్రి, ఆమె అనుచరుల చేతులలో ఉందనీ సోవియట్ అధికారవర్గాలవారు నమ్ముతున్నారుట.

## విజ్ఞప్తి

న్యూఢిల్లీకి చెందిన 'లింక్' వారపత్రికలో వచ్చే అభిప్రాయాలు సాధరణంగా సోవియట్ వర్గాలవారి అభిప్రాయాలయి ఉంటాయి. ఇటీవల ఈ వారపత్రిక కాంగ్రెసు వామపక్షంవారికి ఒక విజ్ఞప్తి చేసింది. కాంగ్రెసు వామపక్షవాదులు తమ పార్టీని వదిలి ఒక యునైటెడ్ ఫ్రంట్‌లో చేరాలన్నది. ఒక సంపాదకీయంలో కాంగ్రెసులోని యువ పురోగమనవాదులందరూ ఇతర వామ పక్షాలవారితో కలిసి పని చెయ్యాలని విజ్ఞప్తి చేసింది. 'కాంగ్రెసు—ఇతర' శక్తులని గురించి మాట్లాడే వామపక్షాలవారిని ఈ సంపాదకీయంలోనే లింక్ పత్రిక విమర్శించింది. (మరొక వ్యాసంలో కాంగ్రెసుపార్టీ లోపల జరిగే మార్పులని గమనించమందుకు కమ్యూనిస్టు పార్టీలు రెండింటినీ మందలించింది.) రెండు సోషలిస్టు పార్టీలతో చేసుకున్న రాజీ కాంగ్రెసులోని వామపక్ష వర్గాలవారితో కమ్యూనిస్టులు చేసుకనటంలేదని గుర్తు చేసింది.

## సర్ దేశాయి వ్యాఖ్య

దీనినిబట్టి మనం గ్రహించగలిగింది ఏమిటంటే, కుడికమ్యూనిస్టుపార్టీ విధానం లింక్ పత్రిక ఆశించినంత సాహసవంతంగా లేదని 'వరల్డ్ మార్క్సిస్ట్ రివ్యూ' లో రాస్తూ శ్రీ ఎస్. జి. సర్ దేశాయి అన్నారు, కాంగ్రెసులోని రియాక్షనరీల, పురోగమనవాదులమధ్య చీలిక ఏర్పడిందనీ, పురోగమనవాదులకిది మంచి అవకాశం అనీ, అయితే కమ్యూనిస్టులు సంఘటనలని అదుపులో ఉంచాలనీ, సిద్ధాంతాలని వదులుకోకుండా వాటికి తగినట్లుగా వినియోగించుకోవాలనీ ఆయన నొక్కి చెప్పారు. బ్యాంక్ జాతీయాన్ని ఆమోదిస్తూ కుడి కమ్యూనిస్టుపార్టీవారు చేసిన ప్రకటనలో కూడా వామ పక్షాలవారి మధ్య ఐకమత్యం ప్రసక్తి ఉంది. ఇందులో కాంగ్రెస్‌లోని 'వామపక్షాలు' పేర్కొనబడకపోయినా ఉద్దేశం స్పష్టంగా ఉంది.

## ఎడమ కమ్యూనిస్టుపార్టీ

ఐకమత్యం గురించి ఇంత చర్చ ఉన్నా ఎడమ కమ్యూనిస్టుపార్టీతో సంధిమాత్రం కనుచూపుమేరలో ఉన్నట్లు కనిపించడు. అంతే కాదు, ఎడమ కమ్యూనిస్టుపార్టీవారు ఇతర వామ పక్షాలవారితో మంత్రివాలు పనికిరావని స్పష్టంగా అన్నారు. బాంకుల జాతీయకరణంలో సోషలిజమ్ అనేది లేదన్నారు. పార్టీవారి పత్రిక 'పీపిల్స్ డెమొక్రసీ'లో పడిన ఒక వ్యాఖ్య కాంగ్రెసు నాయకత్వంలో ఏర్పడిన చీలిక వర్గ విభేదానికి చాలా దూరం అన్నది. అయినప్పటికీ ఇందిరాగాంధి నాయకత్వంకిందఉన్న వర్గం వారు తీవ్రమయిన రియాక్షనరీవర్గంవారు కారని అంగీకరించింది. ఇందిరాగాంధివర్గంవారిని గురించి కలలు కనక పోయినప్పటికీ రెండవవర్గంవారిని ఓడగొట్టడం తమ ధ్యేయాలలో ఒకటి అన్నారు. ●

# కొన్ని సందేహాలు

▣ తెలంగాణా ప్రాంతం రాజకీయ నాయకులు; ప్రజలలో అధిక సంఖ్యాకులు ఆంధ్రప్రదేశ్‌నుంచి తాము విడిపోవాలని గట్టిగా కోరుకుంటున్నట్లు కొంతకాలంగా జరుగుతున్న అలజడినిబట్టి గ్రహించవచ్చు. ఈ అలజడిని ఎవరో కొందరు స్వార్థపరులు లేవదీశారనటం అంత తెలివిగల మాటకాదు. 'ఎవరో కొందరు' లేవదీసిన ఉద్యమాన్ని అదుపులో ఉంచటానికి ఇంత పోలీసుదళం, మిలిటరీ అవసరం అయ్యేదికాదు. అయితే ప్రత్యేక తెలంగాణా ఏర్పాటుకావాలని కోరేవారి వాదాలని కొన్నిటిని పరిశీలిస్తే అవి పరిశీలించేవారికి మానసికంగా కొంచెం అయోమయ పరిస్థితి ఏర్పడక మానదు.

నాకు తోచినంతవరకూ కొన్ని సందేహాలని ఇక్కడ వెలిబుచ్చుతున్నాను. మొదటిది మిగుళ్లని గురించి. 'విశాలాంధ్ర' లేక 'ఆంధ్రప్రదేష్' ఏర్పడినప్పుడు తెలంగాణా ప్రాంతం బాగా వెనుకబడి ఉన్న సంగతి అందరూ ఒప్పుకునేదే. ఇది జరిగిన సుమారు పన్నెండేళ్ళ తర్వాత ఆ ప్రాంతంలో జరిగిన వ్యయం ప్రాంతంలో వచ్చిన ఆదాయానికి సరయిన నిష్పత్తిలో లేదని అన్యాయాలు జరిగాయనే వారు చెప్తున్నారు. రాబడి కన్నా కర్చు తక్కువ ఉంటేనే మిగులు ఏర్పడుతుందని అందరూ అంగీకరిస్తారనుకుంటాను. అయితే, రాబడి ఎంతో, వ్యయం ఎంతో తెలిస్తేనేకాని మిగులు ఉన్నదీ లేనిదీ తెలుసుకోలేము. కొన్ని నెలలకి మునుపు కుమార్ లలిత్ నివేదిక వెలువడింది. ఇందులో జరిగిన పన్నెండేళ్ల కర్చులనీ, ఆదాయాలనీ ఇటూ అటూ మార్చటం జరిగింది. ఈ మార్పులని ఏ విధంగా, ఏ సిద్ధాంతాలని అనుసరించి చేశారో శ్రీ లలిత్ స్పష్టంగా పేర్కొన్నారు. వాటిని తెలంగాణా రాష్ట్రం కావాలనే వారే విమర్శించారు. దీనిని బట్టి శ్రీ లలిత్ చేసిన సర్దుబాట్లు వాదవివాదాలకి అవకాశాలు ఇస్తున్నాయని తేట తెల్లం అవుతోంది. ఆంధ్రప్రాంతం వారి వల్ల తమకి అన్యాయం జరుగుతోంది కాబట్టి విడిపోవాలని ఒక రకం వ్యాఖ్య చేసేవారు అంటున్నారు. తెలంగాణా ప్రాంతంతో కలిసి ఉండటం చేత తమకి అన్యాయం జరుగుతోంది కాబట్టి ఆంధ్ర ప్రాంతం వారు వేరే రాష్ట్రం ఏర్పరుచుకోవాలని మరొక రకం వ్యాఖ్య చేసేవారంటున్నారు.

ఈ రెండోరకం వ్యాఖ్య చేసేవారి లక్ష్యమూ, మొదటిరకం వ్యాఖ్య చేసేవారి లక్ష్యమూ ఒకటే! ఇక్కడ సత్యాసత్యాల ప్రసక్తి లేనేలేదు. ఎందుచేతనంటే, ఒకరు పెద్దమనుష్యుల ఒప్పందం ప్రకారం ఆదాయం ఒక నిష్పత్తిలో వ్యయంమాత్రం మరొక నిష్పత్తిలో కావాలంటున్నారు. మరొకరు అసలు ఈ పెద్దమనుష్యుల ఒప్పందమే తమకి నష్టకారణంగా ఉందికాబట్టి ప్రపంచంలో అన్ని చోట్లా వాడుకలో ఉన్న పద్ధతుల ప్రకారం ఆదాయం లెక్కింపుకీ, వ్యయం లెక్కింపుకీ ఒకే నిష్పత్తిని వాడాలంటున్నారు.

మొదటివర్గంవారు పెద్దమనుష్యుల ఒప్పందాన్ని ఉదహరించి తమకి అన్యాయం జరిగింది కనుక విడిపోవాలంటున్నారు. రెండవ వర్గంవారు కూడా తాము విడిపోవటానికి ఇదేరకం వాదాన్ని వాడుతున్నారు! ఈ అయోమయపరిస్థితిని అర్థంచేసుకోవటం ఎలా? ఇద్దరూ విడిపోవాలని అనుకుంటున్నప్పుడు అడ్డు వచ్చేది ఎవరు?

రెండవది, ఉద్యోగాల సంరక్షణకి సంబంధించినది. న్యాయస్థానంవారు ఇచ్చిన తీర్పుని తప్పించుకుని పనిచేసే పద్ధతులనీ, విధానాలనీ ఆంధ్రప్రదేష్‌ప్రభుత్వం అనుసరిస్తోందని వార్తలని బట్టి గ్రహించవచ్చు. ఇక్కడా ఇక చిక్కులేదు! ఇంతకి మునుపు 'ముల్కీ' నిబంధనల ప్రకారం జరిగిందికూడా ఇంతేకదా? కొన్ని అక్రమపద్ధతులని అనుసరించి కొందరు 'దొంగముల్కీ సర్టిఫికేట్లు' కొనుక్కున్నారనే ఆరోపణ విన్నాను. అప్పుడు దొంగ సర్టిఫికేట్లు అమ్మినవారు ఇప్పుడు అమ్మరని నమ్మకం ఏమిటి? ఇది చిన్నపిల్లలకయినా వచ్చే సందేహం! ఇక ఈ సందేహాన్ని వెలుబుచ్చేవారితో వాదోపవాదాలు దేనికి?

సంరక్షణలు అనవసరం అనేవారు కూడా నిడి తెలంగాణా ఏర్పాటునే కోరుతున్నారు కదా! నేను ఎందరినో 'ఆంధ్ర ప్రాంతం'వారినీ, తెలంగాణాప్రాంతంవారినీ అడిగి చూశాను. అందరూ విడిపోవటం మంచిది; అంటున్నారు. శుభస్యశీఘ్రం! ఇంకా ఆలస్యం ఎందుకు?

—ఎమ్. ఎన్ ఆర్. రావు ●



## ఆలుమగల హత్య— రు. 10 వేల చోరీ

ఫరూకాబద్‌కు చెందిన మహమ్మదాబద్‌లో నరేంద్రనాథ్ జవుహరి అనే శానిటరీ ఇనస్పెక్టర్నీ అతని భార్యనూ నిద్రపోతుండగా నరికి చంపి, వారి ఇంటిలో నుంచి పది వేల రూపాయల విలువైన నగానట్రా ఎత్తుకు పారిపోయారట. గొడ్డలి వంటి ఆయుధం వుపయోగించి వుండి వుండాలని అభిప్రాయపడుతున్నారు.

## భార్యా భర్తల తగువు

కోలార్‌కు చెందిన ఒకపోలీసు (బ్రాహ్మణ వీధిలో అతనిల్లు) తనభార్యతో ఓ అర్ధరాత్రి ఘూమ్మని పో... వేసుకున్నాడట. దాంతో అతనిభార్య ...ల్లోకి వెళ్లిపోయిందట. కొంపదీసి




నూతిలో దూకిందో ఏమో నని భార్యను వెతుకుతూ పెరట్లోకి వెళ్లి తనూ, ఎగిరి నూతిలో దూకాడట. ఆనక పైకి రాలేక గావు కేకలు పెట్టేసరికి రాత్రి డ్యూటీలో వున్న పాంోపోలీసు విని చుట్టు పక్కలవారి సహాయంతో అతన్ని పైకి లాగాడట—ఇదొక రకం భార్యాభర్తల సరాగమా! మేటీ.. మేనాట్చే.

* * *

సాహసకార్యాలు అన్నివేళలా మనవి కావు. ప్రతి దానికి 'ధైర్యే సాహసే లక్ష్మీ' అనే ముక్క నప్పదు. 26వ తేదీ వుదయం పనుమల్లై తిరువరం కుంద్రం స్టేషనుల మధ్య నడుస్తున్న రైలుక్రింద పట్టాలు దాటుతున్న ఒకస్త్రీ, 2, 3 సంవత్సరాల వయసుగల చిన్నపిల్లలిద్దరూ పడి చనిపోయారట. రైలొచ్చేలోగా దాటై పోతామూ అని అనుకుంటుందావిడ పాపం.

* * *




మిస్టర్ చందా అనే ఆయన యింట్లో 4వ తేది ప్రాతఃకాలంలో ఓ ముగ్గురు యువకులు జొరపడి, కత్తితో భయపెట్టి, ఆయనను ఆయన భార్యను, కుమారుణ్ని ఒక మూలకు చేర్చి 250 డాలర్లు, రాళ్ళు పొదిగిన పాతకాలం కత్తి ఒకటి, కొంత మద్యం తస్కరించి పారిపోయారట. వెళ్లేటపుడు ఆయన్ను తాళ్ళతో కట్టేసి మరీ పోయారట. ఇది పవిత్ర భారతదేశంలో జరిగిన విపరీతం కాదు. న్యూయార్క్‌లో జరిగింది. చందా యిల్లు న్యూయార్క్ మేయరు గారింటికి కూతవేటు దూరంలో వుందట— సో వాట్! ఎవరింట్లో దోచుకోవాలో నిర్ణయించుకోడానికి దొంగలకు స్వాతంత్ర్యం లేదూ—దే హేవ్!



## మగవాడుగా మారిన మగువ

హాంకాంగ్ మహిళల ఫుట్‌బాలు ఆట జట్టులోని చాన్పిక్వాన్ అనే మహిళ శస్త్రచికిత్స ద్వార పుటుక్కున మగాడై కూర్చుందట. ఒక మంచి ఆటకత్తె పోయిందని మహిళలు విచారిస్తే, మా మంచి ఆటగాడొచ్చాడని యువకులు ఆనందిస్తున్నారుట—నాచురల్—యట్ ఫంటాస్టిక్.

* * *

రంపారా (రాజ్‌కోట) అనే గ్రామంలో ఆ గ్రామవాసు లెవరో ఒక కోతిని రాళ్ళతో కొట్టి చంపేశారట. దాంతో ఆవూరి వారంతా చేరి, కోతిని చంపిన పాప నివృత్తికి ఆ కోతి భవుతిక కాయాన్ని




వూరంతా వూరేగించి, సశాస్త్రీయంగా పాతిపెట్టారట. ఈ వూరేగింపులో డ్రమ్ములు, వాయిస్తూ కొన్నివేల మంది పాల్గొన్నారట. ఇంతే గాక, ఈ కోతిని పాతిపెట్టిన చోట ఒక చక్కని స్మారకచిహ్నం ఏర్పాటు చేయాలని ఆవూరి ప్రజలాలోచిస్తోంది—ఇన్‌క్రెడిబుల్.

## లంచం యివ్వజూపిన యిద్దర్ని చట్టానికి అప్పగించిన మంత్రి

మెడికల్ కాలేజీలో సీటు కోసం ఒక విద్యార్థికి చెందిన యిద్దరు పెద్దమనుష్యులు (మద్రాసులో) ఆరోగ్యశాఖమంత్రి నెడుంజెళియన్ యింటికి వెళ్ళి కావలసి వస్తే వుంచండి అని వో అయిదు వేలు ఆయన ముందున్న టేబిలు మీద పెట్టారట వచ్చిన యిద్దరిలో ఒకాయన కోయంబత్తూరు కార్మికుల ఇన్సూరెన్స్ ఆసుపత్రిలో డాక్టరట పేరు నటరాజన్. డబ్బు చూపిన వారిద్దర్నీ మంత్రి చట్టానికి వప్పగించారట.

* * *

## తనను తాను పొడుచుకున్న తమిళ నటుడు - అధికారుల అభిప్రాయం

తనను వెనుక నుంచి ఎవరో పొడిచారు మొర్రో అని ఆసుపత్రిలో చికిత్స పొందిన తమిళ నటుడు ఎస్. ఎస్. రాజేంద్రన్ చెప్పిన మాటలను అనేక కోణాల్లోంచి, అద్దాలల్లోంచి చూస్తే చివరికి, ఆయనకు మూర్ఛరోగం వుందనీ, కనుక బహుశా తనను తానే ఆయన పొడుచుకుని వుండి వుంటారని అధికారులు అభిప్రాయపడుతున్నారు. మూర్ఛరోగం వున్నవారు తమని తామే పొడుచుకొనెదరు! ఏమో!!

*　　　*　　　*

ఢిల్లీలో సిటీ బస్సు సిబ్బందికి, దేశభాను కాలేజీ విద్యార్థులకు వచ్చిన సంఘర్షణ ఫలితంగా విద్యార్థులు కాలేజీ వద్ద ఒక టెన్స్ బూతులు తగలేసి, మంటల నార్పు యంత్రం మీద, ఒక సిటీ బస్సు మీద రాళ్ళు రువ్వారట. ఢిల్లీ ట్రాన్స్‌పోర్ట్ వర్కర్స్ యూనియన్ కథనం ప్రకారం బస్సులో ఓ ముగ్గురు విద్యార్థులు టిక్కట్లు కొన నిరాకరించారని దానితో వచ్చిన ఘర్షణ గుద్దులాటగా మారిందనీ తెలుస్తోంది. తనని కాలేజీ ఆవరణలోకి లాక్కెళ్ళి గుద్దులు యిచ్చారని (!) సిటీ బస్సు డ్రయివరు చెప్పాడట. మేము కొంచెం ఆలస్యంగా (రివాజుగా) వచ్చాము. మొత్తంమీద బూతు తగలైడం రాళ్ళు రువ్వడం మాత్రం మేము చూశాము అన్నారట పోలీసులు. డ్రయివరును కేవలం రక్షించాలనే వుద్దేశ్యంతోనే అతన్ని కాలేజీ ఆవరణలోకి తీసుకుని వెళ్ళటం జరిగిందని, అయితే డ్రయివరు తనని అడ్డమైన మాటలూ అనడమే గాక, ఇనప కమ్మీతో కొట్ట ప్రయత్నించాడనీ స్టూడెంట్ యూనియన్ సెక్రటరీ అన్నారట— కేసేమైనా బోధపడిందా! ధింకెవైల్.

## బియ్యపు గింజపై రాష్ట్రపతికి అభినందనలు!

శ్రీ వి. వి. గిరి ప్రెసిడెంటుగా ఎన్నికైన శుభ సందర్భంలో అహ్మదాబదకు చెందిన 31 ఏళ్ళ రాజేష్ కన్సారీ అనే యువకుడు కంగ్రాట్యులేషన్స్ టు మిస్టర్ వి. వి. గిరి (మిస్టర్ వి. వి. గిరికి శుభాకాంక్షలు) అని వో బియ్యం గింజ మీద చెక్కి ఢిల్లీ పంపాడట. మైక్రోస్కోపు సహాయంతో చూస్తేగాని విషయం బోధపడనంత సూక్ష్మంగా చెక్కిన యితని నేర్పుకు అంతా ఆశ్చర్యపోయారు. అదేగాక జాతీయ గీతం జనగణమనను అగ్గిపుల్ల మీదా కూడా యీ యువకుడు చెక్కాడట. పెన్సుల మీద, వాచీల మీదా పేరులు చెక్కడమే యితని వృత్తట. ●

# రచయిత్రి భర్త



ఆరోజు సాయంత్రం ఆఫీసునుండి ఇంటికి రాగానే వేణుగోపాల్‌కి ఓ శుభ వార్తను తెలిపింది అతని భార్య మాధవి.

ఐతే ఆ శుభవార్తే దుర్వార్తగా మారి మున్ముందు తనకో ప్రాణసంకటమైన సమస్యగా తయారవగలదని అతను ఏమాత్రం ఊహించలేకపోయేడా సమయంలో.

స్నానంచేసి, అప్సరసలా అలంకరించుకున్న అర్ధాంగిని సరససల్లాపాలతో అలరించి, కడుపునిండా కమ్మని టిఫినుతిని, కాఫీతాగి, ఈజీచైర్‌లో సంతృప్తిగా కూర్చున్నాడు వేణు.

మాధవి అతని వెనకనే వచ్చి, కుర్చీ చేతిమీద కూర్చుని అతనిమీదకు కొద్దిగావంగి సెంటు జాజుల వాసనతో అతనికి మత్తెక్కిస్తూ 'మీకోసంగతి చెప్పనా?' అంది ముద్దుగా.

'ఒకటేమిటి? వంద సంగతులు చెప్పు. వింటాను. నా కంతటికంటె పనేముంది కనుక యిప్పుడు?' కులాసాగా నవ్వేడు వేణు.

'అంటే ఏమిటి మీ ఉద్దేశ్యం? నేనెప్పుడూ వాగుతుంటాననీ, మీరేమో ఊరికే కూర్చుని వింటుంటారనేగా మీ అర్థం?' చిరుకోపంతో కొంచెం దూరంగా జరిగింది మాధవి.

'అబ్బ అది కాదోయ్! నీనోటినుండి ఎప్పుడు ఎలాటి మాటలు వచ్చినా వినటం నా కిష్టమే! కమ్మని నీ కోకిల కంఠానికి నా గారభస్వరాన్ని కూడా జోడించటం యిష్టంలేక అలా వింటూ కూర్చోవాలనిపిస్తుంది. అంతే!' అన్నాడు వేణు.

ఆధునిక భార్యను ఆనందపరచాలంటే ఆమె రూపవిశేషణాలు, అలంకరణలు, అభిరుచులు మొదలైనవాటిని పొగడటమే కాక మగవాడు అడపాదడపా తనని తాను కించపరచుకుంటూ కూడా ఉండాలన్న విషయాన్ని అనుభవపూర్వకంగా తెలుసుకున్నాడు వేణు.

'ఇంతకీ అలికపూని అసలు సంగతేమిటో చెప్పు' అన్నాడు దూరంగా జరిగిన భార్యని దగ్గరకు తీసుకుంటూ.

'అబ్బ. చెప్పాలంటే సిగ్గేస్తోందండీ... హుఁ!'

'నాముందు కూడా సిగ్గేమిటి? చెప్పు'

'మరే...మరి...నేను చెప్పేక మీరు నవ్వకూడదు మరి.'

చిన్న పిల్లలా షరతులు పెడుతున్న మాధవిని చూస్తే నిజంగానే నవ్వొచ్చింది అతనికి. ఐనా సీరియస్‌గా ముఖం పెట్టి అబ్బే. నువ్వు నవ్వవద్దంటే నేనుమాత్రం ఎందుకు నవ్వుతాను? ఇంక చెప్పు నన్ను నంపక—' అన్నాడు.

'మరి...మరి...నేనో కథ వ్రాసేనండీ!' అంటూ ఓరగా భర్తవంక చూసింది అతని ముఖంలోని భావాలను దొంగచాటుగా పరీక్షచేసే ఉద్దేశ్యంతో.

ఫక్కున నవ్వబోయి వెంటనే దాని పరిణామాలు ఎంత దారుణంగా ఉంటాయో అనుభవం నేర్పిన పాఠాలవల్ల గ్రహించినవాడవటంవల్ల బలవంతాన నిగ్రహించుకున్నాడు వేణు.

'అలాగా! కథ పేరేమిటి? తీసుకురా చూద్దాం' ఎంతో ఆసక్తిని, ఉత్సాహాన్ని ముఖానికి పులుముకుంటూ అన్నాడు.

భర్త అన్నదే తడవుగా ఛంగున లోపలికి గెంతి తను వ్రాసిన మొదటి కథను తీసుకొచ్చి భర్తచేతిలో పెట్టింది మాధవి.

ముత్యాల కోవనంటి అక్షరాలతో వ్రాసి ఉన్న 'ఆధునిక స్త్రీ' అన్న ఆ పదిపేజీల కథను చదివేసరికి తన కళ్లను తానే నమ్మలేకపోయేడు వేణు.

నిజం చెప్పాలంటే ఈనాటి పత్రికా సాహిత్యంమీద అందునా కొల్లలు కొల్లలుగా పుట్టుకొస్తున్న తెలుగు రచయిత్రులమీద యేమంత సదభిప్రాయంలేదు వేణుకి. చాలా మంది రచయిత్రులలానే యేవో వంటింటి కబుర్లు, స్త్రీజన పక్షపాతంతో వ్రాసే సిల్లీ గృహకలహాలు, ఊహాకల్పితమైన స్త్రీల సమస్యలు, ప్రాచీన సంస్కృతిపైన దండయాత్ర మొదలైన విషయాలేవో వ్రాస్తుందని ఊహించుకున్న వేణు భార్య వ్రాసిన కథను చదువుతూనే ఆశ్చర్యపోయేడు.

'ఆధునిక స్త్రీ' ని కథ అనేకన్న విమర్శనాత్మకమైన వ్యాసం అంటే బాగుండుననిపించింది వేణుకి. గత రెండు మూడు శతాబ్దాలుగా మన సమాజంలో జరుగుతూ వస్తున్న మార్పులు, తదనుగుణంగా మారుతూవస్తున్న స్త్రీజీవితం, పరిణామ దశలో స్త్రీ ఎదుర్కొన్న సంఘర్షణ, ఆ తరువాత ఆమె ప్రస్తుతం ఎదుర్కొనవలసివస్తున్న ఆర్థిక, సాంఘిక, నైతిక సమస్యలు...అన్నీ వరుసక్రమంలో ఎంతో సహజంగా, నిష్పక్షపాతంగా, విమర్శనాత్మకంగా చిత్రించింది మాధవి. భాషకూడా చాలా పదునుగా, శైలి బిగువుగా ఉండి పాఠకులను విడవకుండా చదివించేలా ఉంది. ఆకథ చదువుకున్నంతసేపూ అతనికి అంతవరకు తెలియని ఒక 'నూతన వ్యక్తి'ని మాధవిలో చూడగలిగేడతను. ఎప్పుడూ కలకల నవ్వుతూ, మృష్టాన్న భోజనంతో, అందమైన అలంకరణతో, సరససల్లాపాలతో భర్తను ఆనందింపజేయటం తప్ప మరో వ్యాపకం లేనట్లు కనిపించే మాధవిలో అంతటి ఆలోచనాశక్తి ఉందంటే అతనే నమ్మలేకపోతున్నాడు.

'ఏమిటాలోచిస్తున్నారు? నేను వ్రాసిన కథ బాగలేదా?' అన్న భార్య ప్రశ్నతో యీలోకంలోకి వచ్చేడు వేణు.

'కథకేం బ్రహ్మాండంగా ఉంది. దీన్ని ఏ పత్రికకు పంపించుదామా అని ఆలోచిస్తున్నాను' అన్నాడు.

భర్తనుండి అలాటి ప్రోత్సాహాన్ని ఎదురుచూడని మాధవికి ఆమాటలు అమృత తుల్యంగా తోచినయ్.

మర్నాడు ఉదయం ఆఫీసుకు వెళ్తూ దార్లోనే దానిని ఒక ప్రఖ్యాత వారపత్రిక పేర పోస్టుచేసేడు వేణు.

పోస్టుచేసిన దగ్గరనుండి వారం వారం పత్రిక విప్పి చూడటం, అందులో తన కథ లేకపోవటంవల్ల మాధవి నిరుత్సాహపడటం జరుగుతుండేది. చివరికెలాగైతేనేం రెండునెలల తరువాత మాధవి కథ అచ్చయింది.

దాంతో ఎక్కడలేని హుషారు వచ్చి వరుసగా నాలుగైదు కథలు వ్రాసి వివిధ వార, మాసపత్రికలకు పంపింది. మూడు నాలుగునెలలు గడచేసరికి అవన్నీ అచ్చయినయ్.

ద్విగుణీకృతోత్సాహంతో వెంటవెంటనే వ్రాయటం మొదలెట్టి చివరికి ఏడాది తిరిగేసరికి ప్రఖ్యాత కథానికా రచయిత్రిగా స్థిరపడిపోయింది మాధవి. ఇక నవలలు కూడా వ్రాయాలన్న ఆలోచన బయల్దేరింది ఆమెలో.

మాధవి పరంగా యింత ఆశాజనకమైన మార్పులు జరుగుతుంటే వేణు స్థితిమాత్రం నానాటికీ యిరకాటంలో పడసాగింది.

మొదట్లో మాధవి వ్రాసిన నాలుగైదు కథలు అచ్చయినరోజుల్లో ఆఫీసులో అతని సహోద్యోగులు—

'ఏమోయ్ వేణుగోపాల్? మీ శ్రీమతి యీమధ్య కథలు వ్రాస్తోందిటగా!' అనడిగారు.

'ఔను...' ఆనందాన్ని, గర్వాన్ని అణచుకుంటూ ముక్తసరిగా జవాబిచ్చేడు వేణు.

'అదృష్టవంతుడివి...టాలెంటెడ్ వైఫ్ దొరికింది.' చిరాగ్గా చూసేడు వేణు 'ఏం మీరంతా అంత దురదృష్టవంతులా?' అన్నమాట అతని నాలుక చివరిదాకా వచ్చి ఆగిపోయింది.

మరోరోజు ఒకఫ్రెండు కొంపలు ముంచుకు పోతున్నట్టు అడిగాడు 'అన్నట్టు వేణూ! ఇంతకీ ఆ కథలన్నీ మీ శ్రీమతేనా వ్రాసేది, లేక నువ్వూ వ్రాసి పెడ్తావా?' అని'

'నేనువ్రాస్తే, ఎవరిపేరో పెట్టుకునే ఖర్మేం పట్టింది? నాపేరుకేం, లక్షణంగా ఉంది. దాన్నే పెట్టుకుని వ్రాసేవాణ్ణిగా!'

'అహా అది కాదోయ్. ఈ మధ్య పత్రికల్లో ఆడవాళ్లకే ఎక్కువ డిమాండ్ ఉంటోందిగా. అందుచేత చాలామంది మగవాళ్లు తమ స్వంతపేర్లు కాకుండా భార్య పేరో, చెల్లెలి పేరో, ప్రేయసి పేరో పెట్టుకుని వ్రాస్తున్నారనీ, అప్పుడే వాళ్ల రచనలు త్వరగా అచ్చవుతున్నాయనీ విన్నానోయ్. అందుకని అడుగుతున్నాను'

అదేమోగాని, మా విషయంలో అలా కాదు. ఐనా అడ్డమైన చెత్తా వ్రాయటానికి నేనేమన్నా సెంటిమెంటల్ ఫూల్నా? అలాటి రాతలన్నీ ఆడవాళ్లకే సరిపోతయ్' అన్నాడు విసుగ్గా వేణు.

మరికొందరు మహానుభావులు సూటిగా 'నువ్వు వ్రాసిపెడ్తావా?' అని అడగక పోయినా—

'కథలు వ్రాయటంలో మీ ఆవిడకు నువ్వు ఏమైనా హెల్ప్ చేస్తావుటోయ్?' అనడిగేరు.

అప్పటికే రచయిత్రి భర్తగా అనేక మార్లు క్రాస్ ఎగ్జామినేషన్‌కి గురైన వేణు సహనాన్ని కోల్పోతూ 'కథలు వ్రాయటమంటే ఏమైనా వంట చెయ్య

టంటండి! యితరులు హెల్పు చెయ్యటానికి' అంటూ విరుచుకుపడ్డాడు వాళ్ళ మీద.

మాధవి పేరు రచయిత్రిగా స్థిరపడుతున్నకొలదీ వేణు తమ యింటి వాతావరణంలో కూడా చాలా మార్పులు రావటం గమనించేడు.

ఎంతో అణకువగా, సౌమ్యంగా వుండే మాధవిలో ఆత్మవిశ్వాసం, కించిత్ అహం భావం కూడా తలెత్తినట్లు గ్రహించేడు.

ఇంతకు ముందు తను అన్న ప్రతి మాటనీ ఔనని సమర్థించే మాధవి ప్రతి చిన్న విషయానికీ వాగ్వివాదాలలోకి దిగటం, తన ప్రతి కదలికనూ, ప్రతి పలుకునీ విమర్శనాత్మకంగా చూడటం, చర్చలు జరపటం చేస్తోంది. మొదట్లో ఈ రకమైన ప్రవర్తనకి కొంచెం బాధపడ్డా వెంటనే సహృదయుడైన వేణు ఆమె వ్యక్తిత్వాన్ని గౌరవించటం నేర్చుకున్నాడు.

ఓసారి ఆమె వ్రాసిన కథను పోస్టు చేసేముందు అలవాటు ప్రకారం శ్రద్ధగా చదివేడు వేణు. 'ఇదేమిటి? నువ్వు కూడా ఈ మధ్య మగవాళ్లను దుయ్యబట్టటం నేర్చుకున్నావే?' అన్నాడు నవ్వుతూనే.

'ఏం అలా వ్రాస్తే తప్పా?' ఎదురు ప్రశ్న వేసింది మాధవి.

మొదట తెల్లబోయినా వెంటనే సర్దుకుని నవ్వేడు వేణు.

'ఇందులోని తప్పొప్పుల సంగతి నేను మాట్లాడటం లేదు. ఇప్పటికే రచయిత్రుల కలాలనుండి వెలువడుతున్న ఈ రకమైన రచనలతో పాఠకులు విసిగిపోతున్నారు. నువ్వు కూడా వాళ్ల ప్రాణాలు తీయటం ఎందుకూ అని నా బాధ! ఐ పిటీ దోజ్ పూర్ రీడర్స్' అంటూ బయటకు వెళ్ళేడు.

'ఈయనకేం తెలుసు? ఈ నాడు పత్రికా సాహిత్యాన్ని పఠించే వాళ్లలో స్త్రీలే ఎక్కువగా వుంటున్నారు. వాళ్లకి అలాటి రచనలంటేనే యిష్టం. పత్రికాధిపతులు కూడా వాటినే ఎక్కువగా ప్రచురణకి స్వీకరిస్తున్నారు. ఈ రోజుల్లో రచయితలకు కావలసింది పాప్యులారిటీ. వాళ్లలోని 'సరుకు'ను చూసేదెవరు?' అనుకుంది స్వగతంలో మాధవి.

మరో ఏడాదివరకు అదే పంథాలో రచనలు చెయ్యాలని దృఢంగా తీర్మానించుకుంది మాధవి.

అప్పటికి కొద్ది రోజుల్లోనే తల్లి కాబోతోంది మాధవి. విశ్రాంతి తీసుకునే ఉద్దేశ్యంతో నాలుగు నెలల వరకు యేమీ

( 52వ పేజీ చూడండి)




### పి. డి. వి. ఆర్, శృంగవరపుకోట

...దేవదాసుగురించి ఎవరో ఏదో అన్నారని బాధపడడం అనవసరం. టాగూర్ చెప్ప లేదూ మిణుగురులు నక్షత్రాలని చూసి నవ్వుకుంటాయని పెద్దవాళ్లను గురించి చులకనగా మాట్లాడడంవల్ల తమ ప్రయోజకత్వం ఒక మెట్టు పెరుగు తుందనుకునే వాళ్ళు ఎప్పుడూ ఉంటారు అని సమాధానం ఇచ్చారు— ఈ విమర్శ ఎవరిగురించో మీకీపాటికీ అర్థమయే ఉంటుంది...సాహిత్యంలోకూడా ఒకరి పై మరొకరు ఈర్ష్యాసూయలతో ఉన్నారంటే ఏమనుకోవాలి?

మీరంతా గోరంతలు కొండంతలు చేసుకుని ఊహకి పని కల్పిస్తున్నారు. అంతే. దేవదాసు ఒక పాత్ర. శరత్ ఒక మహా రచయిత. నా కా పాత్రలో విశిష్టత కన్పించకపోవడం, పోనీ నా దృష్టి దోషమే అయినా— స్వంత అభిప్రాయం. అంత మాత్రంచేత శరత్‌ని కించపరిచాననుకుంటే ఎలా? పెద్ద తలలు కొట్టి పేరు తెచ్చుకోవాలన్న అవ సరం లేని చాకచక్యం నాకుంది. చదువు నాకుంది. సంస్కారం నాకుంది.... పదిమంది గట్టిగా చెప్తే అది నాకు నిజమనిపించితే తప్ప నమ్మే చంచల స్వభావం నాకు లేదు .... ఇంకేం కావాలి మీకు... రచయితగా నాకో పెద్ద స్థానం ఏర్పాటు చేసుకుని పోదామన్న కాపీనం కూడా లేదు. నా తొలి ప్రకృతి ఇల్లు. మలి ప్రకృతే రచన. అంచేత ఇంటి విష యంలో అసూయలేగాని రచన విషయంలో అవి నాకు అనవసరం. పోతే మీ రనుకుంటున్నట్టు అభిప్రాయ భేదాన్ని కించపరచడంగా అర్థం చెప్పుకునే చిన్నమనసు కలది కాదు— నాకు తెలిసిన మాలతి.

### బి, వి. ఆర్, సికింద్రాబాద్

అక్కయ్యా గ్రామాలలో ఉండే స్వేచ్ఛ పట్టణాలలో ఉండదంటారు నిజమేనా?

దానికి తలక్రిందులు బ్రదర్, పట్నంలో ఎవరి గొడవ వారిది. పల్లెలో ఒకరి గొడవ అందరిదీ. కదూ?

### యం ఎస్, బళ్లారి

మీ దాంపత్యం వరకట్నానికి సంబం ధించినదా!

కాదే. మా వారేం రాజావారు కారు. మా నాన్నేం జమీందారూ కాదు— కట్నం ఇవ్వడానికీ పుచ్చు కోండుకూ. మేమంతా వ్యక్తిత్వానికి విలువ నిచ్చే రకం.

### కె యస్. జి, అనంతపురం

గుడిలో ప్రవేసిస్తూ గంటకొట్టడంలో కల ఆంతర్యం ఏమిటి?

బహుశా దేవునికి బహుపరాక్ చెప్పడమేమో!

### సాగరశ్రీ, అవ్లగడ్డ

వివాహమనగా నర్థమేమిటి? నేటి యువ కాముకుల తుచ్ఛ వాంఛలకు ప్రతి బింబాలైన ఋ్యాపేమ వివాహాలను ఎంత వరకు సమర్థించకలవు? సరితూగ కలవు!

రుక్మిణి కృష్ణులు, శివపార్వతులు, సావిత్రీ సత్యవంతులు, నలదమయంతులు, శకుంతలా దుష్యంతులు... వీరి వివాహములన్నీ ఏ వివాహాలు? యివి పవిత్రతకేం భంగం తెచ్చాయి? ..... కళ్ళు తెరిచి చుట్టూ ప్రపంచాన్ని వోసారి చూడండి. మీరింకా చాలా వెనకబడి ఉన్నారు.....

జీవితానికి జీతానికిగల బేధమేమిటో?

భేదం కాదు— ఉన్నది అవినాభావ సంబంధం!

### కళ్యాణశ్రీ, కోవెలకుంట్ల

స్త్రీలు భర్తలను అన్నం వడ్డించేప్పుడు వాళ్ళజడలు పళ్ళెంలోకి దిగబడుతూ ఉంటాయెందుకండీ?

తినేవాడి కర్మ, వడ్డించేవాళ్ళ పొగరూ. లేకుంటే ఏమిటి? వడ్డనకి దిగేముందు కొంగు కిందుగా వాల్జడ (సవరం! కర్మ!) దోపుకోవాలని తెలియ వద్దా? ఎంత పెళ్లాం ముద్దయితే మటుకు అన్నంలో తలవెంట్రుక వస్తే అసహ్యమే కదు!!

### డి. ఆర్. సి. హెచ్, నంద్యాల

నవలను పుస్తకాలలోలాగా విడివిడిగా సంభాషణ వ్రాసి పంపాలా? లేక అంతా కలిపి రాసిపంపాలా?

న్యాయానికి నవలలో అవసరానికి మించి సంభా షణ అనవసరం. కాని ఈ రోజుల్లో నాటకాలలో కంటే ఎక్కువగా నవలల్లో సంభాషణ లుండడం పాషన్‌గా తోస్తుంది. మరి మీ చిత్తం.

### కె ఎస్. ఆర్, బెక్కెం

రోజు రోజుకీ పుట్టగొడుగుల్లా పుట్టు కొస్తున్న ఈసెక్సు పత్రికల గురించి ఒక్కమాటలో చెప్పండి.

అడుగుడీ— ఇవ్వబడుదురు!!

### బి. జి. యం. కె, వీరవాసం

విపత్కర పరిస్థితులలో చిక్కుకొన్నాను అమూల్యమైన సలహా యివ్వండీ అంటే...

ఏమిటబ్బా ఆ విపత్కర పరిస్థితి? నా సమాధానం వచ్చేదాకా అలాగే ఉంటే నువ్వింక హీరోవేమిటి బ్రదర్, ఈలోగా కాస్త ఫైట్ చెయ్యాలి.

### కె. ఎమ్. ఆర్, అవ్లగడ్డ

'ఉద్యోగమే పురుషలక్షణం' అనే వాక్యా నికి గల నిశ్చితార్థ మేమిటి?

మగవాడెప్పుడూ నిరుద్యోగిగా ఉండకూడదని, ఏదో పని చేస్తూనే ఉండాలని.

### ఎమ్. ఆర్, గుండ్లూరు

ఆశ్చర్యార్థకం వేసానని ఆశ్చర్యపడు తున్నారా? నేనొక నిరుద్యోగిని!

దాల్లో ఆశ్చర్యమేముంది!

### పి. ఎస్. ఎమ్, చిక్కోలి

ప్రేమించినవాడు పోషించలేనప్పుడు ఏం చేయాలి?

ప్రేమించకూడదు. మీకు తెలియదా?—మనం నవ్వుతూంటే మనతో అంతా నవ్వుతారు. కాని మనం ఏడిస్తే కూడా ఎవరూ ఏడవరు. సుఖం పంచాలి. కష్టాలు పంచే హక్కులేదు. కష్టాలలో ప్రేమకి చోటెక్కడ?

### వి. జి, పొద్దుటూరు

మీ ఫోటో పంపుతారా?

ఎందుకు ఈ మొఖమా రాసేదని చదవడం మానేస్తే!

### ఎస్. ఎస్. ఆర్, పిఠాపురం

మీ జీవిత లక్ష్యం ఏమిటి?

బ్రతికినన్నాళ్ళూ చేతనయినంత హాయిగా బ్రతి కేయడం.

మీ కెన్ని భాషలు వచ్చు?

పూర్తిగా ఏభాషా రాదు!

పిరికివాళ్ళు, అర్థంలేని బ్రతుకులు బ్రతికేవాళ్ళూ చావడం మంచిదంటాను.

చిత్తం. అప్పుడు దేశంలో జనాభా కొరత ఏర్ప డ్డం తథ్యం

సమస్యలు సీక్రెట్స్ అయితే ఏమో అనుకోవచ్చు కాని మామూలు ప్రశ్నలడిగే వారి పూర్తిపేరు వేస్తే మీ సొమ్మేం పోయింది?

ఏం కథ? పేరు చూసుకోవాలనుందా? ●



# మనసుల భాష

అరిగె రామారావు

కమల హాలులోంచి వీధిలోకి, వీధిలోంచి హాలులోకి కాలుగాలిన పిల్లిలాగా తిరుగుతుంది.

వరండాలో కూర్చుని రైలు బండితో ఆటలు ఆడుకుంటున్న పెద్ద కొడుకు ప్రకాష్‌ను, 'ఏరా, పోస్ట్‌మెన్ వచ్చాడురా?' అని అడిగింది.

'ఆ, వచ్చాదు. ఇదిగో నీ వుత్తరం' అని నిక్కరు జేబులోంచి 'పుత్తుత్తి' వుత్తరం బయటికితీసి చేయిజాచి పకపక నవ్వాడు.

ఇంకో సమయంలో అయితే కొడుకు నెత్తుకొని ముద్దులాడి వుండేది కాని, యిప్పుడుమాత్రం 'అల్లరి వెధవ!' అని గట్టిగా కసురుకుంది. వాడు బిక్కమొగం వేశాడు.

వరండాలో వాలు కుర్చీలో కూర్చుని వారపత్రిక చదువుకుంటున్న సుందరి ప్రకాష్‌వంక జాలిగా చూచింది. పోస్ట్ కోసం కమలక్కయ్య పడే కంగారును ఇందాకట్నుంచి ఒక కంట కనిపెట్టుతూనే వుంది. ఈవిడ్ది మరీ చోద్యం. పిల్లాడు నవ్వులాటలకు అంటే, మరీ అంత యిదిగా కసురుకోవాలి కాబోలు. వాళ్లాయన దగ్గర్నుంచి పెద్ద లావ్ వుత్తరం తనకే వస్తుంది కదా అని మహా పెద్ద యిది. ఇందాకట్నుంచి వూరికే చిందులు తొక్కుతుంది— అని అనుకుంది సుందరి, 'తరువాయి 22 వ 'పేజీ'ని పత్రికలో వెదుక్కుంటూ.

హాలులో పూలు గుచ్చుకుంటున్న రెండో చెల్లెలు అరుణను, 'ఏమే, అరుణా! పోస్ట్‌మాన్‌గాని వచ్చి వెళ్లాడా?' అని అడుగుతుంది కమల.

'పెద్ద బడాయి' అనుకుంది సుందరి పత్రిక పేజీలు మడుస్తూ.

'ఏమోనక్కా, నేను చూడలేదు' అంది అరుణ.

'ఇరవై నాల్గంటలూ నీకు పూలతోనే సరిపోయే! నీకింకేం పట్టుతుంది?' అసహనంగా అంది కమల. పాపం అరుణ చిన్నబుచ్చుకుంది.

'అస్తమానమూ నీవు బావ రాసే వుత్తరాలకోసం ఎదురుచూడటంలేదు! అదీ అంతే!'

కమల వాళ్లాయన దగ్గర్నుంచివచ్చే వుత్తరంకోసం పడే ఆరాటాన్ని చూస్తూ వుంటె సుందరి మనసు కుతకుతలాడిపోతుంది. 'మరీ బడాయి—' 'మరి చోద్యం,' 'పెద్ద యిది' అని కమలను గురించి ఈ కాసేపటిలో ఎన్నిసార్లు అనుకుందో లెక్కలేదు.

పెళ్లయి ఏడు సంవత్సరాలు దాటుతున్నా, ముప్పైఏళ్లు మీద పడుతున్నా మూడో కాన్పుకు పుట్టింటికొచ్చిన కమలక్కయ్యకు బావకు మధ్య ఎడతెరపి లేకుండా ప్రేమ లేఖలు నడుస్తున్నందుకు సుందరికి కంటగింపుగా వుంది. తనకెందుకా కంటగింపు అంటే తనకే అర్థంకాదు. తన మనస్సును సమాధాన

పెట్టుకుని; మనస్సులోంచి ఆ కంటగింపును తుడిచివేయాలనుకుంటుంది. కాని, ప్రతిరోజూ నాగాలేకుండా కమలక్కయ్య బావ దగ్గర్నుంచి వుత్తరాలు అందుకోవటం. సమాధానాలు రాయటం చూస్తూ వున్నంతసేపు అది సాధ్యపడటం లేదు.

తనకుకూడ ప్రేమ లేఖలు రాసి, పుచ్చుకునే అవకాశము వుంటే అక్కయ్య ప్రేమ లేఖల భాగోతం తన గుండెలమీద సమ్మెట పోటులాగా వుండకపోను. కనీసం తన పందొమ్మిదేళ్ల జీవితంలో 'ప్రేమలేఖ'ను ఒక్కసారి తన కళ్లతో చూచివున్నా తనిప్పుడు ఇంత బాధపడి వుండకపోను — ఆ ప్రేమలేఖ తనకు రాసినది కాకపోయినా సరే! తను స్కూల్లో చదువుకునే రోజుల్లో తన స్నేహితురాలు సుధ వాళ్ల ప్రక్కింటి అబ్బాయితో ప్రేమ సాగిస్తూ వుండేది. యిద్దరూ ప్రేమలేఖలు రాసుకుంటూ వుండేవాళ్లు. అది రోజూ తమ 'ప్రేమచేష్టలు' అన్నీ వివరంగా పూస గ్రుచ్చినట్లు చెప్పేది. కాని, ఒక్కసారి కూడ తనకొచ్చే ప్రేమలేఖను చూపించేది కాదు. అక్కడికీ తనొకసారి నోరు తెరచుకుని అడిగితే, ఎవరికీ చూపించనని పట్టు పెట్టానే అని దాటవేసింది.

తను మెట్రిక్‌కు ట్యూషన్ చదువుకుంటున్న రోజుల్లో సుబ్బారావు అనేవాడు ఒకసారి తనకు తెలియకుండా తన జామెంట్రిబాక్సులో ప్రేమ లేఖ రాసి పెట్టాడు. దాన్ని తను కళ్లతోకూడ చూడలేదు. ఈ మహాతల్లే (కమల) బ్లేడు కోసం పెట్టెతీసి చూచి యింట్లో అందరికీ చూపించి గొడవ గొడవ జేసింది. నాన్నగారు ఆ సుబ్బారావును వాళ్లనాన్నను జడ్జి హోదాలో పిలిపించి క్షమార్పణ చేడించాడు. ప్రేమలేఖ రాయగలిగిన ఫూల్ చేతికి ధైర్యంగా యివ్వకూడదా అని ఆ సుబ్బారావును ఆ రోజుల్లో చాలరోజులుదాక మనస్సులో తిట్టుకుంది.

సుందరి బలవంతంగా మనస్సును చేతికొని వారపత్రికమీద లగ్నం చేసింది — అనిత (అసలు ఇలాటి పెక్యులి పేరు పెట్టిన రచయిత్రిగారి కెంత టెక్కో అని అనుకుంది సుందరి!) ఆసుపత్రిలో స్పెషల్‌రూంలో పురిటి మంచంమీద కూర్చుని భర్త సునిల్‌కుమారుకు (బెంగాలీ దిగుమతి!)— బాబుకు అన్నీ మీ పోలికలే వచ్చాయి అని అంటూ, ఆ నాలుగురోజుల పసికందు రూపురేఖలు వర్ణించి వుత్తరం రాస్తోంది.

—ఏడవకపోయింది. పురిటి మంచంమీద కూర్చుని కూడ మొగుడికి వుత్తరం రాయాలి? ఏం. స్నానం అయ్యేవరకు ఆగగూడదు? ఛీ, పాడు మనుషులూ, పాడు కథలూనూ.

పత్రికను విసురుగా అవతల పారేసింది.

ఇంతలో బయట్నుంచి, 'పోస్ట్' అని కేక వినిపించింది. హాలులో తలదువ్వుకుంటున్న కమల అలా జుట్టు విరబోసుకొనే వీధిలోకి పరుగెట్టటం సుందరి చూచింది.

అదేమిటి పోలేరమ్మలాగా అలా జుట్టు విరబోసుకుని వీధిలోకి పరుగెత్తుతుంది. ఛీ, ఎవరన్నా ఏమన్నా అనుకుంటారని కూడ లేదూ! అరెరె, మీద పమిట జారిపోతున్నా చూచుకోకుండా వుత్తరం చూచుకొని ఓ మురిసిపోతూ గదిలోకి వెళ్లి తలుపులు గడియ పెట్టుకుందే! తలుపులన్నీ బిగుంచుకోనిగాని వుత్తరం చదువకూడదు కాబోలు! బయట అందరూ చూస్తూవుండగా చదువుకుంటే ఎవరన్నా చేతిలో వుత్తరం లాక్కుంటారని భయమా? ఛీపాడు, ఏం మనిషి!

సీతమ్మ (కమలా, సుందరీ వాళ్లమ్మగారు) వచ్చి 'ఏమే సుంది, మీ ఆయన ఇవ్వాళ మధ్యాహ్నం భోజనానికి యిక్కడికే వస్తానన్నాడు కదూ!' అని అడిగింది.

'ఆఁ—' సుందరి నిర్లిప్తంగా సమాధానం యిచ్చింది.

'అన్నట్లు అతడు కాకరకాయ వేపుడు తింటాడు కదూ! అదే అడుగుదామని—'

సీతమ్మ మళ్లీ వంటింట్లో కెళ్లి పోయింది.

సుందరి కళ్లు మూసుకుంది. తన మనోలోకంలోకి వెళ్లిపోయింది. ఆమె ఆలోచనలు ఇలా సాగాయి;

మధ్యాహ్నానికి భోజనానికి వస్తాడా అని అడుగుతుంది. ప్రతిపూటా హాజరు వేయించుకోకుండా ఎక్కడికి పోతాడు? మహాతల్లి—చేశావుగా సమ్మంధం—వున్న వూళ్లో సమ్మంధం, వున్నవూళ్లో సమ్మంధమని; నాన్నగారికిష్టంలేకపోయినా పట్టుబట్టి; రెండోదయినా వున్న వూళ్లో చూడాలనుకున్నప్పుడల్లా కళ్ల పడుతుందని యమతాపత్రయ పడిపోయావుగా! తానో పిచ్చిచచ్చిన్ది. రెండు వీధుల అత్తగారిల్లు. ఇవతల పుట్టిల్లు. కావలసుకుంటె పొయ్యిమీద ఎసరుపెట్టి అన్నం వుడికేలోపల అమ్మగారింటికెళ్లి రావచ్చని అప్పట్లో వూరికే మురిసిపోయింది.

వున్నవూళ్లో సమ్మంధం చేసుకోవటం వల్ల ఆడపిల్లల ఎన్నో సరదాలు తీరని సరదాలుగా అందుకోలేని గగన కుసుమాలుగా, తీరని వ్యథలుగా మిగిలిపోతాయని అనుభవంమీద తెలుసుకున్నది; పెళ్లయిన కొద్దిరోజులుకే! ఎక్కడిదాకనో ఎందుకు ముచ్చటగా మొగుడూపెళ్లాలు ఒక్క వుత్తరంముక్క రాసుకుంటానికి లేదుగా తనలో తొలియవ్వనం మొగ్గ తొడిగినప్పట్నుంచి; వయస్సు ప్రోదిచేసిన ప్రేమ వూహలు తీవలు సాగినప్పట్నుంచి, తనూ ప్రేమలేఖలును అందుకోవాలి, ప్రేమలేఖలు రాయాలి అనే కోరిక తన లేత గుండెల్లో మెల్లమెల్లగా తావు జేసుకుని ఈ నాటికి అది గుండెలమీది పెద్ద బరువుగా నిలిచి పోయింది. పెళ్లయిన తర్వాత ఆ కోరిక తీరుతుంది అని అనుకుంటె వున్న వూళ్లో సమ్మంధం అవటం వల్లన అది తీరని కోరికలాగే మిగిలిపోయింది... ||

నిండా అరగంట గడిచిన తర్వాత కమల కళ్లనిండా వెలుగులు నింపుకుని గది తలుపులు తీసికొని బయటికి వచ్చింది. అనిర్వచనీయమైన ఆనందం ఆమెను నిలువెల్లా వూపివేస్తుంది.

అక్కయ్య ఎంత అదృష్టవంతురాలు అనుకుంది సుందరి. పాతపడినా వచ్చి చావని ప్రేమ బావది. పరోక్షంలో కూడా ప్రతి క్షణం తననే మనస్సులో నిలుపుకుని, తనలోని ప్రతి భావాన్ని, ప్రతి స్పందననూ ఏరోజు కారోజు వుత్తరాల ద్వారా భార్యకు నివేదించుకునే భర్తను కలిగి వుండటం కంటె స్త్రీకి కావల్సినదేముంది?

అలా అని సుందరి భర్త రాజారావు భార్య అంటె ప్రేమలేనివాడా అంటె అదీ కాదు. భార్యంటె ఎనలేని ప్రేమ. ఆ విషయం సుందరికి కూడా తెలుసు. కాని, వచ్చిన చిక్కల్లా ఎక్కడ వచ్చిందంటె సుందరికి తన చిరకాల వాంఛితం నెర

వేరే మార్గం కనిపించటం లేదు. పెళ్ళయి సంవత్సరము దాటుతున్నా భర్తకు ఒక్క ప్రేమ లేఖ రాసే అవకాశము కూడ కలగ లేదు. పెళ్ళయిన దగ్గర్నుండి తననే అంటిపెట్టుకుని వుంటె ఎలా రాస్తుంది. అక్కడికీ ఒకసారి చీకటితో భర్త కంటె ముందుగా లేచి, ఆ రోజు సాయంత్రం సినిమా కెళ్దాం అనే ప్రతిపాదనను అందంగా, అందమైన అక్షరాలతో ఒక చీటి రాసి టేబిల్ మీద పెట్టింది. రాజా రావు మొగం కడుక్కుని వచ్చి ఆ చీటిని చూచి మొగం చిరాకుగా పెట్టి, 'ఎదురుగా మనిషి వుంటె చెప్పకుండా ఈ చీట్లు ఏమిటి అసహ్యంగా!' అన్నాడు. సుందరి అంతటితో నీళ్ళు కారిపోయింది.

ఈ పద్ధతి లాభం లేదనుకుని మరొక విధంగా ఆ అవకాశాన్ని సృష్టించుకోవా లనుకుంది. అందుకనే వారంరోజుల క్రిందట సూట్‌కేసులో బట్టలు సర్దుకుని పుట్టింటికి చక్కా వచ్చేసింది. రెండు మూడు రోజులు ఈ విధంగా ఎడబాటు వస్తే, ఆ ఎడబాటును తీయటిబాధగా, తీరని వ్యధగా తన మొదటి వుత్తరంలో వర్ణిస్తూ లోకల్‌పోస్ట్‌లో భర్తకు రాయా లనే ప్లానుతో వచ్చింది.

కాని, వచ్చిన రోజు సాయంత్రమే మల్లె పూలపొట్లం పట్టుకుని రాజారావు వచ్చాడు. ఏదో పారిపోతున్నట్లుగా తన వెనకాలే వచ్చిన భర్తను చూడగానే సుందరి నీళ్ళు కారిపోయింది.

# మనసుల భాష

మర్నాడు కూడా వచ్చాడు. ఇక ఈ మనిషితో ఇలా లాభం లేదనుకుంది.

'మీరు రోజూ ఇలా వస్తే మావాళ్లేమన్నా అనుకుంటారు. నేనిక్కడ వుండే పదిరోజుల్లో మీరు నాలుగయిదు రోజులకు ఒకసారి రండి. మా బావ కూడ అంతే. వారానికొకసారి వస్తాడు.' అంది. ఇలా అనటం వల్ల తనవాళ్లను తానే వంచన చేస్తోందన్న విషయం సుందరికి తట్టలేదు. తట్టినా పట్టించుకోలేదు.

రాజారావు వెంటనే సమాధానం చెప్పాడు.

'మీ బావంటె పొరుగూరులో వుంటు న్నాడు. అందుకని వారానికొకసారి వస్తాడు. ప్రక్కవీధిలో వుంటున్న నాకు ఆ కర్మేం పట్టింది. రోజూ రెండుపూటలా వస్తాను. ఇకపోతే మీవాళ్ళు ఏమన్నా అనుకుంటా రంటావు. మీ యింట్లో వుండి నేవార్చు తిండి తింటుంటె అనుకుంటారు. పూరికే నిన్ను చూడటానికి వచ్చినా అనుకుం టారూ; అనుకోనియ్. పెళ్లాన్ని చూడ కుండా వుండలేడు అనేగా అనుకునేది. వెరీగుడ్—అది నాకెంతో క్రెడిట్.'

సుందరిని ఇంకా బాగా దగ్గరకు జరిగి భుజంమీద చేయివేసి, తన అంత రాంతరాలల్లో వున్న ప్రేమంతా మాటల్లో వుట్టిపడేటట్లుగా అన్నాడు: 'కాదు సుందీ, నిన్ను వరుసగా నాలుగయిదురోజులు చూడ కుండా నేను వుండగలనా? అది నాకెంతో కఠినాతి కఠినమైన శిక్ష తెలుసా! మన యింటినుండి ఆఫీసుకు పోవాలన్నా, ఆఫీసునుండి యింటికి పోవాలన్నా యిట్నుంచే పోవాలిగా. రోజూ ఆఫీసుకు పోయేటప్పుడు, ఆఫీసునుండి వచ్చేటప్పుడూ నిన్ను నాకళ్లార చూచుకుని కాసేపు మాటాడి వెళ్లిపోతాను సుందీ? వీళ్ల యింట్లో కాఫీ కాదుకదా, కనీసం వచ్చి మంచినీళ్లయినా త్రాగను సుమా. నిన్ను నా కళ్లార చూచుకోవటమే ఒక గొప్ప వరంగా భావిస్తాను.'

రాజారావు మాటలు పూర్తి అయ్యే సరికి సుందరికి కళ్లనిండుగా నీళ్లు వచ్చాయి. తన కన్నీటిని భర్త దృష్టి నుండి తప్పించుకోవటానికి మళ్లీ అతని భుజమే కావల్సి వచ్చింది. భర్త భుజం మీద తలపెట్టుకుని అతన్ని బల్లిలాగా కరచుకుపోయింది. తను పూర్వికే (వుత్తరాల మోజులో) అలా అన్నదికాని, తను మాత్రం తన దేముడ్ని చూచుకోకుండా వుండగలదా? అమ్మో!...

అప్పుడు అలా అనుకోవటానికి కారణం ఆ క్షణం కలిగించిన హృదయస్పందన; అంతరాంతరాల్లోని ప్రేమ బరువును మోసిన ఆ క్షణం యొక్క గొప్పదనము. కోటానుకోట్ల క్షణాలతో నిండిన తన జీవితంలో ఆ ఒక్క క్షణం మహత్తర మైనదని, మిగతా క్షణాలనుగూడ ఆ క్షణమంత మహత్తరంగా చేసుకోవటం తన చేతుల్లోనే వున్నదన్న విషయం సుందరి గ్రహించుకోలేక పోయింది. అందువలనే ఈ రోజు కమలక్కయ్య బావ వుత్తరాలకోసం పడిన ఆరాటం, వుత్తరం వచ్చిన తర్వాత పడిన ఆనందం తన గుండెల్లో కుమిలింపుకు కారణమయింది. ఎలాగైనా భర్తను నాలుగురోజులుపాటు యిక్కడకు రానీయకుండా చేద్దామనే ఆశతోనే మిగతా రోజులుకూడ యిక్కడే వుండిపోయింది. అందువలనే గుండెల్లో నొప్పి అనే సాకుతో నెల్లాళ్లపాటు పుట్టింట్లో విశ్రాంతి తీసికోవటానికని వచ్చిన తనకు యింకా గుండెనొప్పి తగ్గటం లేదు.

చిన్నల్లుడు వారం రోజుల్నుంచి రోజూ రెండుపూటలా వస్తున్నా యిక్కడ కనీసం కాఫీగూడ త్రాగటం లేదన్న విషయం





# బ్రూక్ బాండ్ బ్రూ

ఇన్‌స్టంట్

## క్షణంలో తయారు! కప్పులకొలది సంతృప్తి!

ఇది క్షణంలో అయేది!
సమయం మిగిలిస్తుంది!
డబ్బు ఆదా చేస్తుంది!

బ్రూ చెయ్యడం అతి సులభం! వేడినీళ్ళు, రుచికై పాలు, పంచదార కలపండి అంతే. నిజమైన కాఫీ చికోరి సువాసనతో మీకు హాయి గొలిపే బ్రూ క్షణంలో తయారవుతుంది!

జ్ఞాపకం ఉంచుకోండి. హడావిడి గాని, గొడవ గాని, వడపోయటంలో సమయనష్టం గాని బ్రూ తో లేదు.

అదీ గాక మీ రుచికి తగినట్లుగా, కప్పుకి కొంత హెచ్చుగా గాని తక్కువగా గాని కలిపి తగురీతిగా చేసుకోవచ్చును.

బ్రూ కొరకు అడగండి—కాఫీ చికోరి ఎలా రుచించాలో తెలిసిన బ్రూక్ బాండ్ నిపుణులచే, జాగ్రత్తగా కలుప బడినది.




Bensons/338B/2 TELR

సుందరి నాన్నగారికి ఆరోజు పుదయమే తెలిసింది. తొమ్మిదిగంటలకు ఆఫీసు కెళ్ళుతూ యిక్కడికి వచ్చిన రాజారావును మధ్యాహ్నం భోజనానికి రమ్మని గట్టిగా బలవంతంచేసి వప్పించారు. అందుకనే ఇందాక సీతమ్మ, 'మీ ఆయన కాకరకాయ వేపుడు తింటాడే!' అని అడిగింది. చిన్నల్లుడికి యిష్టమైన కూరలు చేసే ప్రయత్నంలో వుండి.

ఆ మధ్యాహ్నం భోజనాలు అయిన తర్వాత కమల మెల్లగా సుందరి పండుకున్న గదిలోకి వచ్చింది. కాసేపు ఆ మాటలు, ఈ మాటలు మాటాడి, 'సుంది, నీదగ్గరవున్న లెటర్ పాడ్‌లోవి నాలుగు కాగితాలివ్వవే!' అని అడిగింది. కాగితాలు కోసం నాదగ్గరికి వచ్చావుకాని, నామీద ప్రేమవుండి వచ్చావా తల్లీ అని మనస్సులో అనుకుంటూ లెక్కపెట్టి నాలుగంటె నాలుగు కాగితాలు చించి యిచ్చింది.

'అబ్బ, ఎంత జాగర్తగా లెక్కపెట్టి మరీ యిస్తున్నావే? కాపోయినా నాకు తెలియక అడుగుతానుగాని నీవు ఎవరికి వుత్తరాలు రాస్తావనే ఆపాడ్ నీకు. అది నాకిచ్చేయరాదంటె!' అని అంది కమల, కాగితాలు తీసికొని బయటికిపోతూ.

ఆ మాటలు సుందరి గుండెల్లో ఎక్కడ తగలాలో అక్కడే తగిలాయి. అసలు తను ఎవరికి వుత్తరాలు రాస్తుంది? ఎవరికి తను రాసే వుత్తరాలు కావాలి...సుందరి గుండెలు మూగగా ఏడ్చాయి! తను ఉత్తరాలు తెగరాసేయాలని ముద్దులొలికే నీలి రంగు లెటర్‌పాడ్ కొత్తది కొనుక్కుని మరి వచ్చింది యిక్కడికి. ఆ కొత్త పాడ్‌లో సగం కాగితాలన్నీ కమలే తీసికుని వాటిమీద మొగుడికి వుత్తరాలు రాసుకుంది ఈవారం రోజుల్లో!

సాయంకాలం అయిదుకొట్టేవరకు కమల వుత్తరం రాస్తోనే వుంది. సుందరి రెండు మూడుసార్లు దొడ్లోకి వంటింట్లోకి వెళ్ళుతూ వస్తూ కమల గదిముందు తారట్లాడింది. మంచంమీద బోర్లా పడుకుని దిండుమీద కాగితాలు పెట్టుకుని జడ ముందుకేసుకుని కాళ్ళు పైకెత్తి వూపుతూ వుత్తరం రాస్తోన్న కమలను చూడగానే సుందరికేలాగో అనిపించింది.

# మనసుల భాష

అక్కయ్య ఎంత అదృష్టవంతురాలు. అంత తన్మయత్వంతో అలా తన వారికి వుత్తరాలు రాసుకోవటం నిజంగా ఒక పుణ్యమనే అనుకోవాలి. తను ఆ పుణ్యానికి నోచుకోలేదు కదా!

కాలేజినుండి వచ్చిన చిన్న తమ్ముడు రవిని రైల్వేస్టేషన్‌కెళ్ళి ఆర్. ఎం. యస్‌లో వుత్తరం పోస్టుచేసి రమ్మని బతిమాలుతుంది కమల.

మరీ చోద్యం కాకపోతే, రైలువెంబటి పరిగెత్తించటమేమిటి? రేపు వేయకూడదా? అంత అర్జంటు అనుకుంటె పోస్టుటైం కాకముందే వుత్తరం రాయటం పూర్తిచేయకూడదు— అనుకుంది సుందరి.

రవి కాసేపు గునిసి సైకిల్ ఎక్కి స్టేషన్‌కు పోయాడు.

సుందరి సూట్‌కేసు సర్దుకుని అత్తవారింటికి బయలుదేరింది. ఇంట్లో వాళ్ళంతా, ఇంత అకస్మాత్తుగా బయలుదేరావేమిటని గొడవ మొదలుపెట్టారు. మీరెంత గొడవచేసినా నేను ఈపూట వెళ్ళి తీరవల్సిందే అని కూర్చుంది. పోనీ ఆఫీసు నుండి రాజారావు ఎటూ ఇప్పుడు వస్తాడు కదా, వచ్చిన తర్వాత యిద్దరూ కలిసి పొండని సీతమ్మ అంది. 'వస్తే వెళ్ళిపోయాను అని చెప్పండి, అని రిక్షా పిలిపించుకుని వెళ్ళిపోయింది. వెళ్లబోతూ, మిగిలిపోయిన లెటర్ పాడ్‌ను కమలకు యిచ్చివేసింది. ఎందుకే అంటె, 'నేనెవరికి రాస్తాను, నీవు బావకి రాయి. బావకి నీలిరంగు కాగితాల మీద రాసే నీ వుత్తరాలంటె యిష్టమన్నావుగా!' అని అంది.

కబురులేకుండా అకస్మాత్తుగా వచ్చిన కోడల్నిచూచి, 'అదేమిటమ్మాయి అప్పుడే వచ్చావు?' అని అంది ముసలి అత్తగారు.

'ఏం రాకూడదా?' అంది పెడసరంగా.

'రాకూడదని నేనెందుకంటాను తల్లీ!' అని, మళ్ళీ కోడలుకు పొయ్యిమీద బియ్యం పడేసింది.

స్నానంచేసి జడేసుకుంటూ అనుకుంది— ఎలాగూ ఈ మనిషి తనను చూడకుండా ఒక్కరోజుకూడ వుండలేడు. అమ్మగారింటి దగ్గరుండి లోకల్ పోస్టులో వుత్తర ప్రత్యుత్తరాలు జరపాలనుకున్న ఆశ అడియాశ అయిపోయింది. ఇలాటప్పుడు తనిల్లు వదులుకుని వాళ్ళ కొంపలో వుండటం దేనికి? అక్కడవున్న దగ్గర్నుంచి 'ఆ వుత్తరాల మనిషి' కమలక్కయ్యను చూస్తూ వుండాలి; తన దురదృష్టానికి కుమిలిపోతూ వుండాలి. వచ్చేయటమే మంచిదయ్యింది.

మర్నాడు సాయంత్రం రాజారావు ఆఫీసునుండి దిగులుగా వచ్చాడు. సుందరి కంగారుగా, 'ఏమిటి, ఏమయింది ఎందుకలా వున్నారు?' అని అడిగింది.

'హైద్రాబాద్‌లో మూడేదో ట్రైనింగ్ పెట్టారు. పదిహేనురోజులు అక్కడ వుండాలి. రేపే వెళ్లాలి' అన్నాడు నీరసంగా.

సుందరి ఎగిరి గంతేసినంత పనిజేసింది. పట్టరాని సంతోషంతో పుబ్బి తబ్బిబ్బయిపోయింది. 'అయితే ఈ రాత్రికి వెళ్ళుతారా? రేపు ఉదయమా? హైద్రాబాద్ నుండి నాకేమి తీసికొస్తారు—' ఇలా ఏవేవో మాట్లాడింది వుషారుగా.

సుందరి వుషారు చూచేసరికి రాజారావుకు మతిపోయింది. తనను పదిహేను రోజులు వదిలి వుండటానికి సుందరి వొప్పుకోదు, తనను పోవద్దని పట్టుబడుతుంది, అని అనుకున్నాడు. సుందరి కోసమయినా ఏదో వొకవిధంగా ఈ ట్రైనింగ్‌కు వెళ్లకుండా తప్పించుకోవాలని నిర్ణయించుకున్నాడు. కాని, తీరా సుందరి వుషారు హడావుడి చూస్తువుంటె, తనను ఈ రాత్రికే హైద్రాబాద్ బండి ఎక్కించేటట్లు వుంది. తనలాగే తనని చూడకుండా ఒక్కక్షణమైనా వుండలేదని వూహించుకోవటం పొరపాటే అయింది. ఈమధ్య సుందరి చాలా మారిపోయింది. మొన్నకూడ ఇంతే, తను వాళ్లమ్మగారింటికొస్తాను అంటె వద్దు అని అంది. తనే వుండబట్టక రోజూ రెండుపూటలా వెళ్లేవాడు. తనను గేటుబయట చూడగానే ఏదో షాక్ తిన్నట్లు కృంగిపోయేది. తనని కావాలని దూరంచేస్తోంది. ఎందుకిలా మారిపోయింది.

'ఏమిటి ఏదో తెగ ఆలోచిస్తున్నారు? సూట్‌కేసు సర్దనా? ఎన్నిజతలు పెట్టుమంటారు?'

'కాదు సుంది, నిన్ను వదిలేసి ఎలా

వుండాలి? నేనీ ట్రైనింగ్‌కు పోను—'

'బలేవారే! చిన్నపిల్లాడిలాగా మాట్లాడు తారేమిటి? ట్రైనింగ్ యిస్తాం రమ్మంటె పోను అంటారేమిటి? నేనేం అయిపో తాను. నన్నెవరూ ఎత్తుకుపోరు లేండి. తోడుగా మీ అమ్మగారుకూడ వున్నారుగా!'

రాజారావు నీరసంగా కుర్చీకి అంటుకు పోయాడు. ఇది తను పూర్తిగా ఆశించని సహించలేని జవాబు. సుందరి ఇలా మాట్లాడుతుందేమిటి?

'ఆఁ అన్నట్లు మర్చిపోయాను సుందీ! హైద్రాబాదులో చాల గొడవలుగా వున్నాయి. అక్కడివాళ్ళంతా ప్రత్యేక తెలంగాణాకు ఆందోళన చేస్తూ నానా గొడవలు చేస్తు న్నారు. పేపర్లో చూడటంలా— అనేక అత్యాచారాలు జరుగుతున్నాయట. ఆంధ్రు లంతా వచ్చేస్తున్నారు—' ఈ దెబ్బతో సుందరి హడలిపోయి ట్రైనింగ్ వద్దూ, పాడువద్దూ, అని తప్పనిసరిగా అంటుంది అనుకున్నాడు.

సుందరి అలా అసలేదు. పకపక నవ్వి, 'మీరేదో అనుకున్నాను. వుత్త పిరికివారండి. ఆడపిల్లలాగా మాట్లాడుతున్నా రేమిటి? అక్కడ మిమ్మల్ని ఎవరేం జేస్తారండి. ఎవరన్నా వింటె నవ్వుతారు వూరుకోండి—' అంది.

రాజారావుకు విపరీతమైన కోపంవచ్చింది అక్కడంత ప్రమాదంగా వుందని తెలిసినా పోండి పోండి అని నెట్టుతోంది. తనకే మయినా అవుతుందనే భయం కాస్తకూడ లేదు. పైగా ఆడపిల్లా, పిరికివాడనా అంటుంది. కడుపులో ఇంత కపటం పెట్టుకున్న మనిషికోసం, ప్రేమకోసం ఆశించటంకూడ పొరపాటే! ఏది ఏమైనా సరే తనీ రాత్రికే వెళ్ళిపోవాలి.

రాజారావు భోజనం కూడా చేయకుండా అప్పటికప్పుడే బయలుదేరాడు. సుందరి సంతోషంగా సాగనంపింది. రోజు విడిచి రోజు వుత్తరం రాయమని ఒకటికి పది సార్లు గట్టిగా నొక్కి నొక్కి చెప్పింది. హైద్రాబాదులో అతని అడ్రసు అడిగి తీసికుంది, తనుకూడా రాయటానికి. పెద్ద ప్రేమ కారిపోతున్నట్లు వెధవ కబుర్లు అని మనస్సులో అనుకుంటూ రిక్షాఎక్కి వెళ్ళిపోయాడు బస్సుస్టాండింగ్‌కు.

తన చిరకాల వాంఛితం ఈ విధంగా నెరవేరబోతుంది కదా అని సుందరి తెగ సంబరపడిపోయింది.

మర్నాడు ఉదయమే కాఫీలు త్రాగటం అవగానే భర్తకు 'ప్రేమలేఖ' వ్రాయటం మొదలుపెట్టింది. గడిచినరాత్రి వంటరిగా తనెంత విరహాన్ని అనుభవించిందీ, చంద్రుడు తనని ఎలా వెక్కిరించింది, వెన్నెల ఎంత వేడిగా సోకిందీ, నిద్రలో తనెన్నిసార్లు ప్రక్కన తనకోసం తడుము కుందీ—వున్నవి లేనివి కల్పించి అన్నీ రాసే సింది. ఆ వుత్తరం ఆ రోజంతా రాస్తూనే వుంది. మర్నాడు పోస్ట్‌చేద్దామంటె ఆది వారమయిపోయింది. మళ్ళీ ఆయివారు 'తాజాకలాలు' రాసింది.

సోమవారంనాడు ఆ వుత్తరాన్ని పోస్ట్ డబ్బాలో పడేసింది. ఆ క్షణంలో, ప్రపం చంలో తనంత అదృష్టవంతులెవరూ వుండరని వూహించుకుంది. ఆరోజు పెద్ద పండుగ చేసుకున్నంతగా సంబరపడి పోయింది. శనివారంనాడు వుత్తరం పోస్ట్ చేస్తే సోమవారం అందుతుంది. ఒకవేళ భర్త దగ్గర్నుంచి జాబు వస్తుందేమోనని పోస్ట్‌మేన్‌కోసం ఎదురు చూచింది ఆరోజు. కమలక్కయ్యేకాదు తనుకూడ పోస్ట్‌మేన్ కోసం ఎదురుచూస్తూ వుందన్న భావం ఆమెకెంతో గర్వాన్ని కలిగించింది. ఎదురు చూచిన పోస్ట్‌మేన్ ఎదురింట్లో వుత్త రాలు యిచ్చి కనీసం యిటుకేసి కూడ చూడకుండా చక్కాపోయాడు. సుందరి కొన్నిక్షణాలు దిగాలుపడిపోయింది. అయ్యో ఈ మనిషికి ఆ ధ్యాసవుంటే యిక అను కునేదేముంది అని మనస్సులో అనుకుంది.

రెండురోజుల తర్వాత అంటే బుధ వారం నాడు దీపాలు పెట్టిన తర్వాత సుందరి తన భర్తకు రెండో వుత్తరం రాయటానికి కాగితం పెన్ను తీసికొని కూర్చుంది. అత్తగారు దొడ్లో తులసికోట గూటిలో దీపం పెట్టుతూవుంది. ఇంతలో వీధి తలుపు చప్పుడయింది. సుందరి వినుక్కుంటూ లేచి వెళ్ళి తలుపు తీసింది. తలుపుతీసి ఎదురుగుండా కనిపించిన దృశ్యం చూచి ఆశ్చర్యపోయింది. నోటి వెంట మాటకూడ రాలేదు. ఎదురుగుండా రాజారావు వున్నాడు. ఎలా వున్నాడు. పెరిగిన గడ్డంతో, మాసిపోయిన గుడ్డలతో, చెరిగి పోయిన చిందర వందరగావున్న క్రాపుతో బికారిలాగా వున్నాడు. వుత్తచేతులతో వచ్చాడు. వెంట తీసికెళ్ళిన సూటుకేస్, ఎయిర్‌బాగ్ లేవు.

మెల్లగా లోపలికివచ్చి కుర్చీలో కూల బడ్డాడు. దొడ్లోనుంచి లోపలికి వస్తూ కుర్చీలో పిచ్చివాడులాగ కూర్చున్న కొడు కును చూచి ముసలమ్మ కంగారుపడి పోయింది. కొడుకును కావలించుకున్నంత పనిచేసి, 'ఇదేమిట్రా నాయనా, ఇదేమిట్రా తండ్రీ!' అని బావురమన్నది. కాస్సేపటికి మెల్లగా మంచినీళ్ళు కావాలని అడిగాడు. సుందరి లోపలి కెళ్ళి తీసికొని వచ్చింది.



భార్యను మిరిమిరి చూస్తూ గ్లాసందుకున్నాడు. ఆ చూపుకు సుందరి భయపడిపోయింది.

నీళ్ళు త్రాగిన తర్వాత మాటాడటానికి కాస్త ఓపికవచ్చింది.

జరిగిందేమిటంటె — రాజారావు హైద్రాబాద్‌కు వెళ్ళిన మర్నాట్నుంచి అక్కడ అల్లర్లు పెచ్చురేగిపోయాయి. ప్రత్యేక తెలంగాణాకోసం సత్యాగ్రహులు ఆందోళన జరుపుతుండగా గుండాలు ఎక్కడ్నుంచి వచ్చారో ఎలా వచ్చారో గాని రంగంలోకి దిగారు. దౌర్జన్య చర్యలకు దిగారు. పోలీసులకు ఆందోళనకారులకు మధ్య ఘర్షణ జరిగింది. పోలీసులు కాల్పులు జరిపారు. ఎంతో మంది చనిపోయారు. అంతా అల్లకల్లోలమైపోయింది. కర్ఫ్యూ కూడా విధించారు. రాజారావు రెండురోజులు తిండిలేక హోటల్ గదిలోనే వుండిపోయాడు. మంచినీళ్ళు త్రాగి పొట్ట నింపుకున్నాడు. బయటికి రావటానికి కర్ఫ్యూ అమలులో వుంది. మూడోరోజు వుదయం యిడ్లీలు తెప్పుకుని తింటుండగా రౌడీమూకలు అతని రూం మీద దాడి చేశారు. చేతినున్న వాచీ, వుంగరం, పర్సు, బట్టలు, సూటుకేసు — వంటిమీద వున్న గుడ్డలు తప్ప మిగతా వన్నీ ఎత్తుకుపోయారు. కాదు దర్జాగా తీసుకొని పోయారు. ఆఖరికి సిగరెట్టు పెట్టె, అగ్గిపెట్టె కూడ తీసికున్నారు.

కట్టుబట్టలతో వూరుగాని వూళ్ళో

# మనసుల భాష

రెండు రోజులపాటు భయంతో నకనకలాడుతున్న కడుపుతో వడిరోడ్డున విలబడ్డాడు. హోటల్‌వాడి బిల్లు పూరెళ్ళి పంపిస్తాను అంటె వాడు పాపం సరే అని వప్పుకున్నాడు. హైద్రాబాద్ అంతా పిచ్చికుక్కలాగా తిరిగాడు. అలా తిరుగుతుంటె తన కాలేజిమేట్ ఒకడు కనిపించాడు. అతని దగ్గర ఇరవైరూపాయిలు తీసికొని బయలుదేరాడు. బస్సులు లేవు. తుఫాను మూలంగా రైళ్ళు అంతకు ముందే ఆగిపోయాయి. ఒకరోజంతా కొంతదూరం లారీలోను, కొంతదూరం చిన్న కారులోను, మరికొంత దూరం బస్సులోనూ ప్రయాణం చేసి చావు తప్పి కన్ను లొట్టపోయి ఎట్టకేలకు యింటికి జేరుకున్నాడు. వెళ్ళినరోజు తప్ప మళ్ళీ ట్రైనింగు ఆఫీసు మొగం కూడ చూడలేదు.

అంతా విని రాజారావు తల్లి మళ్ళీ బావురుమంది. 'బిడ్డ వెళ్ళనే అన్నాడమ్మా. మహాతల్లి ఈవగారు వెళ్ళు వెళ్ళు అని ముడ్డిపట్టుకుని నెట్టింది.' అని కాసేపు ఏడ్చింది.

వేడినీళ్ళ స్నానం చేసి, కాస్త మజ్జిగ అన్నం తిని గదిలో మంచం మీద పండుకున్నాడు. స్నానం దగ్గరకు, భోజనం దగ్గరకు సుందర్ని రానీయలేదు. దగ్గరకు వస్తేనే చాలు కసురుకున్నాడు.

సుందరి గుడ్లనీళ్ళు గుడ్లు కుక్కుకొని ముంచుకొస్తున్న ఏడ్పును పంటి బిగువున ఆపుకొని ఎలాగో గడిపింది. దేనికో గదిలోకి వెళ్ళి, మంచం మీద బల్లిలాగా కరుచుకుపోయి పండుకున్న భర్తను చూడగానే దుఃఖం ఆపుకోలేకపోయింది. అతడ్ని వాటేసుకుని బావురమంది. అలా ఎంతసేపు ఏడ్చిందో.

భర్తే జాలిపడి చివరికి సుందర్ని ఓదార్చవలసి వచ్చింది. సుందరి కుదుటబడిన తర్వాత చేత్తో మెల్లగా వీపుమీద రాస్తూ, 'ఎందుకని సుందీ, ఈ మధ్యన నీవు ఇలా మారిపోయావు? నేనేం తప్పు చేశానని నన్నిలా దూరదూరంగా పెట్టుతున్నావు' అని అడిగాడు.

ఏమని సమాధానం చెప్పుతుంది? మళ్ళీ వెక్కి వెక్కి ఏడ్చింది.

'ఇందాక అమ్మ మరీ బెంబేలు పడిపోతుందని చెప్పలేదుగాని. ఒకచోట ఫైరింగ్ జరుగుతున్నప్పుడు వేరొక షాపు చూరు కింద నిలబడ్డాను. నా కళ్ళెదుట తుపాకి గుండు తగిలి నలుగురు అక్కడికక్కడే నేలకూలారు. ఆ గుండే నాకు తగిలివుంటె —'

మాట పూర్తి చేయనీయకుండా సుందరి భర్త నోరు చేతితో మూసేసింది. మంగళసూత్రాలు తీసి కళ్ళ కద్దుకుంది.

భర్తను కరచుకుని పండుకుని మెల్లగా తనకు వున్న 'ప్రేమలేఖల పిచ్చి'ని గురించి, కమలక్కయ్యకు వుత్తరాలు వచ్చే విషయం, తనకున్న మోజు తీర్చుకోవటానికి గుండె నొప్పి సాకుతో పుట్టింటి కెళ్ళటం, ఆ మోజులోనే అతన్ని హైద్రాబాద్‌కు పొగనంపటం — అన్నీ వరుసగా చెప్పింది.

అంతా విన్న తర్వాత రాజారావు పకపక నవ్వి, 'పిచ్చి బొంద!' అని అంటూ ఇంకా దగ్గరకు లాక్కున్నాడు. అతని గుండెల మీద తల పెట్టి పండుకున్న సుందరి అనుకుంది, ఈయన గుండెలు, 'నిన్ను ప్రేమిస్తున్నాను. నిన్ను ప్రేమిస్తున్నాను' అని అంటూ ఎన్నో ప్రేమ రహస్యాలు ఇంత స్పష్టంగా పలుకుతుంటె, ఇంకా వుత్తరాలతో పనేమిటి? మనసును పలికించలేనివారికి, మనసు పలికే ప్రేమభాషను అర్థంచేసుకోలేని వారికి వుత్తరాలు, పత్రాలూ కావాలి గాని మాకు దేనికి? ●






శ్రీ

# గౌరవం ఎవరికి?

బులుసు వేంకటరమణయ్య

మనిషికి విద్యవల్లనే గౌరవం కలుగుతుందంటారు. లౌకికదృష్టిలో— విద్యున్నంతమాత్రాన గౌరవం కలగదు. విద్యతోపాటు వినయంవుండాలి. ఇవి రెండూ వున్నప్పటికీ మాట మంచితనం వుండాలి లేకపోతే పొగరుబోతని అందరూ ఈసడిస్తారు. వీటికితోడు శరీరం సహజంగానో అసహజంగానో అందంగా—ఆకర్షణీయంగా వుండేటట్లు కనబడాలి. అన్నింటికంటే ముఖ్యమైనది. చక్కని దుస్తులను ధరించడం !

చక్కని దుస్తులను వేసుకునివుంటే— అతడు బాగా చదువుకున్నవాడనీ, గొప్పవాడనీ, మర్యాదవుండే కుటుంబంలో పుట్టినవాడనీ అభిప్రాయం ఏర్పడుతుంది. మంచి దుస్తులు వేసుకునివుంటే దొంగలైనా మర్యాదస్తులవలెనే చెలామణీ అవుతారు.

ఒక శ్రీమంతుల యింట్లో గొప్ప వైభవంగా ఒక వివాహం జరిగింది. ఎందరో శ్రీమంతులూ, గొప్ప ఉద్యోగస్తులూ ఆహూతులయినారు. ఆ సాయంకాలం పేరుపొందిన గాయకుల పాటకచేరీ, దానికి అనుబంధంగా అల్పాహారవిందూ జరిగాయి. ఘరానా మనుష్యులే తప్ప అనాహూతులయిన సామాన్యులు లోపల ప్రవేశించకుండా వుండేటట్లు చూడటానికి గేటుదగ్గర కాపలా మనుష్యులు కూడా వున్నారు. సామాన్యదుస్తులు వేసుకున్న ఒక వ్యక్తి ప్రసిద్ధ గాయకుల పాట వినాలనే కుతూహలంతో రాగా, ద్వారపాలకులు అడ్డగించారు. 'కమ్మని ఫలాహారాలు ఆరగించడానికి లోపలికి పోతు'న్నట్లు వారిలో ఒకడు అన్నాడు. తనకు టీపార్టీతో సంబంధం లేదనీ, ఆవైపు వెళ్లననీ, పాటకచ్చేరీ జరిగేవైపు వెళ్లడానికి అనుమతించాలనీ ఆ వ్యక్తి ప్రాధేయపడినా ప్రయోజనం లేకపోయింది.

ఒక్కనిమిషం ఆలోచించి ఆ వ్యక్తి వెనుకకు పోయాడు. అతడు ఇంటికిపోయి విలువైన వస్త్రాలు, అల్‌పాకా కోటు, సన్నని జరీఅంచు తలపాగా, వెడల్పు జరీగల అంగవస్త్రమూ, ఖరీదైన కాలిజోడూ ధరించి అరగంటలో—అంటే సరిగా పాట ప్రారంభమయే సమయానికి వచ్చి జంకూ, గొంకూ లేకుండా ద్వారందాటి లోపలికి పోయాడు. ఎవరో గొప్పవారు వస్తున్నారని ద్వారపాలకులు నమస్కారంచేసి పక్కలకు జరిగారు. అతడు అయిదారు అడుగులు వెళ్లేసరికి ఒక వ్యక్తి 'దయచేసి, ఆవైపు వెళ్లి అల్పాహారాలు స్వీకరించి, ఆ తర్వాత సభవైపు వెళ్లా'లని ప్రార్థించి, దారి చూపాడు. అనాహూతుడైన ఆ వ్యక్తి లోలోపలనే నవ్వుకుంటూ— నిర్బంధంమీద వెళ్లినట్లు ఆ వైపువెళ్లి అల్పాహారాలనూ, పానీయాలనూ స్వీకరించి, తర్వాత సభాస్థలికిపోయి, గాయకుల పాటను విని ఆనందించాడు. ఆర్భాటంగావున్న అతని వేషమే అతనికి అవకాశాన్ని కలిగించడమే కాకుండా గొప్ప మర్యాదను కూర్చింది. అందువల్ల లౌకికంగా వస్త్రానికే గౌరవం. వకారాలన్నిట్లో అదే ప్రధానమైనది. అంచేతే అన్నారు పెద్దలు—

'వస్త్రేణ వపుషా వాచా
విద్యయా వినయేన చ,
వకారైః పంచభిర్హీనో
నరో నాయాతి గౌరవమ్.'

వస్త్రం, వపువు అంటే శరీరం, వాక్కు, విద్య, వినయం— అనే ఈ అయిదు వకారాలూ (మొదట వకారం వుండేవి) లేకపోతే మనుష్యుడు గౌరవాన్ని పొందలేడు' అని. ●



# పరిష్కారం

సీరియల్

శిఖా వెంకటరమణ




### జరిగిన కథ

జయ మేనమామ కొడుకు కాళిదాసు. చదువుల కోసం మద్రాసుకి వస్తారు. అక్కడ జయకి సాంబు కనిపిస్తాడు. సాంబు జయని గుర్తుపడతాడుగాని, జయ సాంబుని ఎరగనంటుంది. సాంబు కాళిదాసుతో తన కథ చెబుతాడు. రాజశేఖరం జయని పెళ్లి చేసుకోమని కాళిదాసుని అడుగుతాడు. భారతికి అన్యాయం చెయ్యడం అతనికి ఇష్టంలేదు. జయ సాంబుని గుర్తుపట్టినట్టు చెబుతుంది. మార్గరెట్ సాంబుని ప్రేమించిన వ్యక్తి. ఆమెకి జయ అంటే గిట్టదు. మార్గరెట్ సాంబుచేత తిరస్కరింపబడి స్వదేశానికి వెళ్లిపోతుంది. కాళిదాసు భారతి భార్యాభర్తలవుతారు. జయ గర్భవతి అవుతుంది. కాళి సాంబుకోసం వెతుకుతాడు. అతను దొరకడు.

## 8

రెండువారాలు దాటకముందే కాళిదాసు మరదల్ని వెంటబెట్టుకొని బయలుదేరి వచ్చేశాడు. ఆపద్బాంధవుడిలా ఆయన ఆదుకోవడం కాళిదాసు ఆశ్చర్యానికి అంతులేదు. భగవంతుడు మంచివాడనీ, అన్యాయకుల పట్ల వుంటాడనీ యెన్నో పుస్తకాలు చదివి 'ఓహో' అనుకున్నాడు. యెంతో మంది అనగా విని 'అలాగా' అనేవాడు. కానీ ఆ విశ్వాంతర్యామి యెట్టయెదుట అదృశ్యంగా చేసే వుపకారానికి తలమునకలే అయిపోయేడు. ఈ ఆనందం పట్టలేక తానేమీకాదు కద! అనుకున్నాడు. భగవంతుడి వునికిని అపహాస్యంగా చిత్రించే ఒకళ్లిద్దరిదగ్గర యెలుగెత్తి తన స్వానుభవాన్ని విప్పి చెప్పాలని తహతహలాడిపోయేడు.

'బాబుగారూ ఈ ఋణం' అన్నాడు కాళిదాసు భయపడుతూ.

'హుం' ఆయన వేదాంతిలా నవ్వేరు: 'ఇందులో ఋణాల ప్రసక్తిలేదు కాళిదాసూ! నా స్వార్థం కొంత లేకపోలేదు. ఈ వృద్ధాప్యంలో యే క్షణాన అయినా పండుటాకు రాలిపోవచ్చును. తలకి కొరివి పెట్టేందుకు కొడుకు కావాలని మన శాస్త్రాలు విప్పిచెప్పేయి. నువ్వు నాకు బిడ్డవి కావాలనే స్వార్థంతో ఈ సమయంలో నిన్ను ఆదుకున్నాను' అన్నారు ఆయన మందలిస్తూ.

ఆయన బీచ్‌వైపు షికారు బయలుదేరుతూ కాళిదాసుని కూడా రమ్మన్నారు. కాళిదాసు ఆయన వెనుకే బయలుదేరాడు. కారు అయిదు నిమిషాల్లో బీచ్ చేరుకుంది. జనసందోహంగా చాలా కోలాహలంగా వుంది ఆ ప్రదేశం పూర్తిగా. ఆయన కాలినడకన కొంతదూరం నడిచి కొద్దిగా నిర్మానుష్యంగావున్న ఆవైపున యిసకలో కూర్చున్నారు. పిల్లలు యిసకలో గూళ్లు కట్టుకుంటున్నారు. జంటగా వచ్చిన కొందరు కబుర్లలోపడి లోకాన్ని మరిచిపోయినట్లు ప్రవర్తించసాగారు. సాయంత్రం ఆరుగంటలైంది. ఆదివారం మూలాన చాలా సందడిగా వున్నది బీచ్ ప్రాంతం అంతా. సముద్రపు కెరటాలు విరుచుకుపడుతున్నాయి. పాత కెరటం కొత్త కెరటం తాకిడికి తట్టుకోలేకపోతోంది. మరో కెరటం వచ్చేసి ముందున్న కెరటాన్ని దూరంగా తరిమేస్తోంది. ఆయన నిశ్శబ్దంగా సముద్రాన్నే తిలకిస్తున్నారు. కాళిదాసు మోకాళ్లమీద చేతులు వేసుకుని ఆయన్నీ, సముద్రాన్నీ మార్చిమార్చి చూస్తూ సమన్వయ పరుచుకుంటున్నాడు. సముద్రంలాగే ఆయన యెంత లోతైన మనిషి. ఆయన పెదవి విప్పితే కడలి కెరటాల్లాగే ముద్ర వేస్తాయి. యేవిటీ అనుబంధాలు? కలా; నిజమా?? ఈ వ్యక్తికీ తనకీమధ్య పరిచయం యెంత అల్పం?

ఆయన భారంగా నిట్టూర్పు వదలి అన్నారు: 'కాళిదాసూ! జయలక్ష్మిని నేను పరీక్షగా చూసేను. నాకు అర్థం అయిపోయింది. ఆడపిల్లచేసే తప్పుని చిలవలు పలవలు అల్లి సృష్టించి అవహేళన చేయడం మాత్రమే మన సంఘానికి తెలుసునోయ్. నిజానిజాలు గుర్తించాల్సిన అవసరం యేమాత్రంలేదు ఈ సమాజానికి. మనం పాచికలమాదిరి తేలిపోతున్నాం

పాపిష్టి లోకంలో. జయలక్ష్మికి 'సోమ్నాంబాలిజం'. మనం మెంటల్ స్పెషలిస్టుకి చూపించడం యెంతైనా శ్రేయస్కరం.'

కాళిదాసు అన్నాడు: 'నేనే స్వయంగా గమనించేను బాబుగారూ! యిదమిద్ధంగా తేల్చుకోలేక భారతి మొదట్లో నాతో చెప్పలేకపోయింది. అప్పుడే తెలుసుకునివుంటే యింత అనర్థం సంభవించేది కాదు.'

'మెదడులో కాన్షస్ బ్రెయిన్‌మీద అన్‌కాన్షస్ బ్రెయిన్ చేసేదాడి ఫలితం ఈ జబ్బు.'

'అంటే?' కాళిదాసు అర్థం కానివాడిలా కుతూహలంగా ప్రశ్నించేడు. అతనికి తెలియకకాదు, ఆయన నోటి వెంట వినాలని.

'చేయాలని మనసు వేధించే పనులేవో కారణంగా ఆగిపోతాయి. ఐ మీన్ వాటిని కంట్రోల్ చేస్తుంది బ్రెయిన్. ఒక చిన్న వుదాహరణ: స్నేహం విషయమే తీసుకుందాం. ఆడపిల్ల మగపిల్లడితో స్నేహం చేయాలనుకుంటుంది. అది మన సాంఘిక వ్యవస్థ దృష్ట్యా అపవాదులకి గురి చేస్తుందని భయపడి తన కోరికని బలవంతంగా అణిచేసుకుంటుంది. అలా చేయకూడదని కాన్షస్ బ్రెయిన్ ప్రబోధం వల్ల లొంగిపోతుంది తాత్కాలికంగా. రాత్రిళ్లు కాన్షస్ బ్రెయిన్ యే సంచలనమూ లేకుండా స్తబ్ధంగా వుండిపోతుంది. అప్పుడు ఈ అన్‌కాన్షస్ బ్రెయిన్ పట్టపగ్గాలు లేని ఖైదీలా విజృంభించి దాడి చేస్తుంది. అక్కడే మనిషిలో అణగారిపోయిన కోరికలు రెక్కలు తెచ్చుకుని స్వారీ చేస్తాయి'

'మర్నాడు ప్రొద్దున యెవరితో గమనించి ఆ చర్యలన్నీ ప్రత్యక్షంగా చూసిన యెవరు ఎన్నివిధాల కూపీ లాగాలని ప్రయత్నం చేసినా ఫలితం వుండదు. ఆ సంగతులేవీ పేషెంటుకి జ్ఞాపకం వుండవు.'

'జయలక్ష్మి బుద్ధిపూర్వకంగా ఈ పని చేయలేదని నేను విశ్వసిస్తున్నాను. యిందుకు మార్గం మీరే ఆలోచించాలి బాబుగారూ!'

'ఆలోచించేను. తగిన ట్రీట్‌మెంట్ యిస్తే పూర్వపు మనిషి అవుతుంది. యిందుకు నీదీ భారతిదీ యెక్కువ సహకారం కావాలి.'

'చెప్పండి బాబుగారూ!'

'డెలివరీ నాటికి భారతిని యిక్కడికి తీసుకు వచ్చేయాలి. యిద్దరికీ మనకి విక్



లానె ప్రసవం జరిగేట్ట్లు చూడాలి.!

'అలాగే బాబుగారూ!', కాళిదాసు అన్నాడు. అతని అంతరంగంలో అన్నీ సమస్యలే. 'అందుకే జయ కారణం చెప్పలేక పోయింది,' అనుకున్నాడు సానుభూతిగా. ఆయన చెప్పే సంగతులు వింటూ కాళిదాసు తలెత్తి పరిసరాలపై దృష్టిని నిలిపాడు. సూర్యుడు అప్పటికే పశ్చిమాద్రిన దిగంతాలలోకి కృంగిపోతున్నాడు. యెర్రని కాంతులు ప్రపంచాన్నలముకున్నాయి. పాలపిట్టలు ఆకాశం మీదుగా యెగిరిపోతున్నాయి. సూర్యాస్తమయానికి ముందున్న కాంతులు చెదిరిపోయేయి. చిత్రకారుడి రంగులపేటిక కలగా పులగం అయిపోయింది. ఆకాశం వివిధ రంగులతో నిండిపోయింది. తూరుపు వైపున విరుపు రంగులో చల్లగా పైపైకి పాగి మేఘాలమీదుగా చంద్రుడు బయటికి వస్తున్నాడు.

'చూశావా కాళిదాసూ; భయంకర సాంధ్య చీకట్లు యెన్నో క్షణాలు కాపురం చేయవు. కష్టాలూ అంతే. చల్లని చంద్రోదయం మనసులో గుబుల్ని పోగొట్టే యడం లేదూ,'

కాళిదాసు తెప్పరిల్లి 'అవును బాబుగారూ!' అన్నాడు వినయంగా.

'చూడు కాళిదాసూ! నేను యింక వడవలేను. [illegible] యిక్కడికే తీసుకురా. మనసులో అనవసరంగా [illegible] [illegible] కష్టాలు [illegible] [illegible] [illegible] [illegible]. నీకు నేను న్నాను!' [illegible] [illegible] [illegible] [illegible] [illegible] కాళిదాసు [illegible] [illegible] [illegible] [illegible] [illegible].

రాఘవరావుగారు అక్కడే ఆగి [illegible] [illegible] [illegible] [illegible]. [illegible] [illegible] [illegible] [illegible] [illegible], అతను [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible]. 'పిల్లటికి [illegible] [illegible] [illegible]. [illegible] [illegible] [illegible] [illegible]?' [illegible] [illegible] [illegible].

ప్రేమతో అందరి మనసుల్ని [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible]

# పరిలిప్తం

రాఘవరావుగారూ నిస్వార్థంగా మరో ప్రాణికి యింత సహాయం చేయడంలో యెటువంటి అపార్థాలూ కనిపించవు. అందరూ కఠినులే అయివుంటే జయలక్ష్మిలాంటి ఆడపిల్లలు సమాజానికి అనవసరంగా బలి అయిపోయేవారేమో. కృతజ్ఞతపట్ల అంత నమ్మకమే వుండివుంటే కాళిదాసు ఈ అనవసర జంజాటాన్ని శిరస్సుమీద వుంచుకునే వాడుకూడా కాదు.

కాళిదాసు వ్యక్తిగత విషయాలన్నిటినీ దాచిపెట్టి మామూలు క్షేమసమాచారాలతో యింటికి వుత్తరాలు రాసేవాడు. దానికి జవాబు తండ్రో, మేనమామో, వీలుకానప్పుడు తల్లో యెవరో ఒకరు రాసేవారు. యే వుత్తరం విప్పి చదివినా కుశలం అడుగుతూ రాయడం తప్ప ప్రత్యేకమైన సంగతులేవీ వుండక పోయేవి. భారతి గురించి తప్పని సరిగా ఆ వుత్తరాల్లో రెండో మూడో వాక్యాలు వుండేవి. జయ పేరైనా కనిపించేదికాదు. అక్కడికీ ఒకటికి రెండుసార్లు ఆ వుత్తరాన్ని పదే పదే చదువుకునేవాడు, తన దృష్టిలో లోపం వున్నదేమో అనే భ్రమలో. కానీ... అతనికి త్వరలోనే మనిషి స్వభావం అర్థం కాసాగింది. క్రమంగా యిటునుంచి కూడా వుత్తరాల వరవడి తగ్గిపోయింది. నెలకో, రెండునెలలకో అతను కార్డు రాస్తాడు. మనోరమ స్త్రీ. సాటి స్త్రీ హృదయగత స్థితిని అర్థం చేసుకోగల మనోయిల్లాలు. [illegible] [illegible] జయ విషయం రాస్తూ ఆ [illegible] జవాబు రాయమని కోరుతూ, [illegible] [illegible] [illegible] [illegible]




కన్నీటిని కాగితం మీద వ్యక్తం చేయలేని మిధ్యావస్థలో దీనాతిదీనంగా రాసేది. కాళిదాసు చదువుకుని పిచ్చిగా తనలో తనే నవ్వుకునే వాడు.

తల్లి సాంత్వన వచనాలు అతన్నిఫూరట పరచకపోగా పైపెచ్చు వైరాగ్యంలోకి త్రోసేసేవి. భారతి అన్నమాట ప్రకారం పురుడు పోసుకుందికి రాఘవరావుగారి ఇంటికి వచ్చేసింది. తను నిండుమనిషే అయినా జయకి కావలసింది దగ్గరుండి అడిగి తెలుసుకునేది. అలాంటి సమయాల్లో జయ కన్నీరు కురిపిస్తూ 'నామీద నీకింత శ్రద్ధ దేనికి భారతీ, నేను పాపిష్ఠిదాన్ని. దౌర్భాగ్యురాల్ని. నా నుదుట భగవంతుడు వక్రరేఖల్ని యెన్నోగీసి వుంచేడు. నేను పతితని. నాక్కావలసింది యేమిటే అని అడుగుతున్నావా' అంటుంది.

భారతి జాలిగా చూస్తూ 'ఛ' అలాగని ఈ యింట్లో యెవరూ అనడం లేదు జయా. యిది యెలాగో జరిగిపోయింది. జరిగినదానికి యెవరూ యేమీ చేయలేరు. ఈ యింట వున్నది మనుషులుకారు' అంటుంది.

'అవును వీళ్ళు మనుషులుకారు. బాబాయి, కాళిదాసూ...ఆఖరికి నువ్వూ... యే ఒక్కళ్ళూ మనుషులుకారు భారతీ మీరంతా దేవతల్ని మించిపోయేరు. నాకీ యింట యింత స్థానాన్నియిచ్చి మీ సరసన నిలబెట్టుకుంటున్నారు. యెందుకో? యేమిటో?'

'నువ్వు యెక్కువగా మాట్లాడుతున్నావు'

'మరిచిపోయేను భారతీ. నేను యింత మాట్లాడకూడదు. నిజమే. వెర్రిగా యేమిటో అనేస్తున్నాను. అసలు' జయ మధ్యలో మాట ఆపేసి భారతివైపు అర్థం కానిదానిలా చూస్తుంది. వెంటనే సిగ్గుపడి తల దించేసుకుంటుంది. నెలలు నిండుతూంటే జయలక్ష్మికి అర్ధరాత్రి మెలుకువ రావడం క్రమంగా తగ్గిపోయింది. దురదృష్టపు ఘడియలు నెత్తిన శివతాండవం చేస్తూంటే అప్పుడు ఆవిధంగా జరిగిపోయింది. రాఘవరావుగారి కృషి సఫలీకృతం అయిపోయింది. అందుకే జయ క్రమంగా మనుష్యుల్లో పడసాగింది.

క్రమంగా నెలలు నిండాయి. భారతికి

జయకి రెండుమూడురోజుల తేడాలో ప్రసవం జరిగింది. జయకి మేజర్ ఆపరేషన్ చేశారు. రాఘవరావుగారి మొహంలో తృప్తి యెంతో సేపు నిలవలేదు. జయకి బిడ్డ దక్కలేదు. కాళిదాసు జయపక్కనే కూర్చుని దోషిలా వుండిపోయేడు. జయ దోసిట్లో మొహాన్ని దాచుకుని పిచ్చిదానిలా యేడు స్తూండిపోయింది. జయని వోదార్చేందుకు ధైర్యం చాలలేదు అతనికి: 'బావా!' జయ చాలాకాలానికి అతన్ని గుర్తుపట్టినదానిలా పిలిచింది.

'ఊరుకో జయా! యేది జరిగినా మన మంచికే. నేను పెద్దవాడిని నామాట వినాలి' రాఘవరావుగారు జయ శిరస్సుమీద అనురాగంతో చేయి వేశారు.

జయ కళ్ళురెండూ పైకెత్తి కాళిదాసు మొహంలోకి సూటిగా చూస్తూ అడిగింది: యేం బావా బిడ్డ పుట్టగానే పోయేడా?'

'అవును తల్లీ,' రాఘవరావుగారు మధ్యలో కల్పించుకున్నారు. 'బావా! నువ్వు తీసుకు వెళ్ళేవా, బాబాయి తీసుకు వెళ్ళేరా?' 'నేనే నమ్మా,' కాళిదాసు దుఃఖాన్ని దిగమింగు తున్నవాడిలా అన్నాడు.

జయ చిన్నగా శబ్దం లేకుండా నవ్వింది: 'తీసుకు వెడితే తీసుకు వెళ్ళావు బావా. వెళ్ళేముందు నేను స్పృహలో కూడా లేను. నాకు స్పృహ వచ్చేవరకూ యెందు కుంచేవు కావు నువ్వు. మనిషి చూపు కోసం మనం యెన్నెన్నో ప్రయోగాలు చేసి శవాన్ని చెక్కు చెదరనీయకుండా దాచివుంచు తాం కదా. అటువంటిది కొన్ని గంటల కోసం ఆపి వుంచలేక పోయేవా!

వింటున్న కాళిదాసు నిశ్శబ్దంగా కన్నీరు కారుస్తున్నాడు. రాఘవరావుగారి గుండెలు చెరువులవుతున్నాయి.

'నువ్వెందుకు బావా యేడుస్తావు. అవును మరి యేడవక యేం చేస్తావు: ఈ బాధకి యేడవ్వలసిన వాళ్ళంతా కట్టు కట్టుకుని నీ మీద భారం వేసి నిన్నొక్కడినే వాతో కలసి యేడవమంటున్నారు. నిజం బావా! ఈ బాధ నువ్వు భరించ లేవు' జయ పెద్దగా నవ్వుతూ అన్నది: 'యింక నేను నవ్వను బావా! నువ్వేడు స్తూంటే నాకూ యేడుపు వస్తోంది. బావా! బిడ్డ బాగున్నాడా! సాంబశివంలా వున్నాడా బావా! నువ్వు గుర్తుపట్టలేదూ. ఛ! యింక యేడవకూడదు. చచ్చి పోయే డుగా, మంచిపని చేశాడు దేవుడు. లేక పోతే ఈ సంఘానికి నేనేం సమాధానం చెప్పగలిగేదాన్ని? వాడు చనిపోక పోయినా బలవంతంగా యేదో ఓ రోజున నా చేతితో హతమార్చేవాడు...'

'తప్పు జయా! నువ్వు రెస్టు తీసుకో వాలి. యిలా పిచ్చిపిచ్చిగా మాట్లాడితే

అందరూ చూసి నవ్వరూ'

జయ కళ్లనిండా నీళ్లు కమ్ముకున్నాయి. 'నిజం నిజం. నవ్వుతారు. మరి నవ్వరూ. యిలా వాగుతూంటే నిజం తెలిసిపోయి పగలబడి నవ్వుతారు. నేను వాగనులే బావా. నోరు మూసుకుంటున్నానుగా!' కాళిదాసు ప్రేమగా యేడుస్తున్న జయ భుజంమీద చేయి వేశాడు. జయ గొంతు విప్పలేదు. మరి. భారతి పక్కనే అందాలు చిందిస్తూ మంచంలో చాలాభాగం పసిపిల్లలెవరూ ఆక్రమించనంత స్థలాన్ని స్వంతం చేసుకుని మరీ పుట్టాడు రఘురావ్. కాళిదాసు ఆయనమీద భక్తి శ్రద్ధలే, ప్రేమనీ అంతకుమించి వ్యక్తం చేసుకోలేకపోయేడు.

రఘురావ్ యిద్దరు తల్లుల ముద్దుల బిడ్డడు. యెవరి చేతుల్లోనో ఒకరి చేతుల్లో వుండడమేగానీ వాడికి సామాన్యంగా 'ఊయల' అనేది ఎలా వుంటుందో తెలియదు. అదీ యిదీ కాకపోతే తాతగారి మంచంమీద బోసినవ్వులు చిందిస్తూ దర్జాగా పడుకోవడం మాత్రమే వాడికి తెలియని నిజం. మేడ్రాసునే కాదు పూర్తి ప్రపంచానికి కన్ను కప్పగల న్యాయాన్యాయాల సమర్థత ఆయనకి వుంది: 'నువ్వింక మన హాస్పిటల్ చూసుకోగలవా తల్లీ' అన్నారు జయని చేరబిలిచి. జయ ఆయన వక్షస్థలంమీద వాలిపోయి తనివితీరా యేడ్చింది: 'యిలా యెందుకు జరిగింది బాబాయ్. సాంబశివం యేమైపోయేడు? నాకు ... కనీసం వాడుకూడా దక్కలేదు' అంటుంది గుండెలు మండే వేదనలో.

ఆయన కళ్లు అశ్రుపూరితాలవుతాయ్: 'అదంతా ప్రారబ్ధం తల్లీ. గతాన్ని పూర్తిగా మరిచిపోవాలి. నా వైపు చూడు. నేను చెప్పేది అర్థం చేసుకుంటావా?'

జయ కళ్లు పైకెత్తి చూస్తుంది. ఆయన చెప్పేది వింటూ.

'ప్రపంచాన్ని కొంతవరకే మోసగించగలం జయా. మాతృప్రేమని అణిచిపెట్టేసి బ్రతకడం మహా దుర్లభం. నీ బిడ్డడే బ్రతికివుంటే సంఘానికి యేమని సమాధానం చెప్పేదానివి ? రేపు వాడు పెరిగి పెద్దవాడై నా తండ్రి యేడీ అని నిలదీసి అడిగితే నువ్విచ్చే జవాబు ఆలో

# పరిలిప్తం

చించగలవామ్మా'

'తల్లీ తండ్రి చేసిన తప్పుని తన శరీరానికి రుద్దుకుని ఆ పిల్లడు జ్ఞానం తెలియనంతవరకూ హాయిగానే బ్రతకగలడు. పాపిష్ఠి ప్రపంచం నీ తల్లి యిటువంటిది అని గురిచూసి రాయి విసురుతుంది; సరిగ్గా వాడి గుండెలమీదికి. అప్పుడు ప్రారంభం అవుతుంది రభస. నువ్వు ఆలోచించి చూడు. దయామయుడైన దేవుడు నీకు పుత్రశోకం కలిగించాడనే అనుకుంటున్నావు కానీ యెటువంటి సమస్యని పరిష్కరించేడో గ్రహించగలిగేవా?'

జయ మౌనంగా విని ఆయనకి దూరంగా జరిగి నిలబడి అన్నది: 'నా మనసు స్థిమితం లేదు బాబాయ్. సాంబశివం నా జీవితంలో యిలా కలిసినట్లేకలిసి మాయం అయిపోయేడేం ? పోనివ్వండి బాబాయ్. ఈ అవస్థలో నేను హాస్పటల్‌కి రావడం కూడా అంత మంచిది కాదనిపిస్తోంది!'

జయ అభ్యర్థన ఆయన త్రోసివేయలేక పోయేరు. చేదోడు వాదోడుగా భర్తకీ, రాఘవరావుగారికీ భారతే సహాయం చేస్తోంది. భారతి పూర్తిగా జయ విషాద పరిస్థితిని అర్థం చేసుకుంది. తల్లి అయ్యేక పిల్లడినే పోగొట్టుకుంటే అటువంటి విషమ పరిస్థితుల్లో ఆ మాతృహృదయం తల్లడిల్లిపోయే బాధ యెటువంటిదో వూహా మాత్రంగా ఆలోచించి గజగజలాడి పోయింది. రఘురావ్ అందరికీ ముద్దుబిడ్డే. తోటమాలి దగ్గర నుంచి నాయర్ దాకా అంతా యెత్తుకునే వాళ్లే. కన్నతల్లి దగ్గర పాలకి మినహా వాడు ఆ ఛాయలకే రాడు. జయ వొంటరి జీవితంలో బాబు పాత్ర అద్వితీయమైన ముద్రవేసింది. యింటిపట్టునే వుండే జయ ప్రొద్దున్నే లేవగానే బాబుకి మొహం కడిగించడం, పాలు పట్టడంతో ప్రారంభం అయిన పనులు సాయంత్రం భారతి వచ్చి చేతులందించే వరకూ తీరిక చేసుకోదు. క్షణకాలం ఆలోచించేందుకే వ్యవధి వుండదు.

కాళిదాసుతో రాఘవరావుగారు నెమ్మదిగా పిలిచి అన్నారు: 'ఈ ప్రేమ యింతటితో ఆగిపోవాలి. జయ మళ్లీ మామూలు మనిషి యిన్నాళ్లకి అయింది. పసిపిల్లాడి బంధంతో ఆవిడ తనని తాను మరిచిపో కూడదు. నువ్వు జయని నీతోబాటు డిస్పెన్సరీకి తీసుకువెళ్లే ప్రయత్నం చేయి.

కాళిదాసు 'అలాగే', అన్నాడు బుర్ర వొంచుకొనే. జయ తన గదిలో కూర్చుని బాబుని వొళ్లో కూర్చోపెట్టుకుని ఆట వస్తువుని యిచ్చి ఆడిస్తోంది. గుమ్మం దగ్గరే ఆగిపోయిన కాళిదాసుకి గొంతులోంచి మాటలు పెగిలిరాలేదు. చాలాసేపటికి అక్షరంలో అక్షరం కూడబలుక్కుంటున్న వాడిలా అన్నాడు: 'ఇలా చూడు జయా!'

జయ తలెత్తింది.

'నువ్వు మెడిసన్ చదివావు. నీ వల్ల బయటి ప్రపంచానికి యెంతో లాభం వుంది. నా మాటకి కొంచెం విలువ యిచ్చి డిస్పెన్సరీకి రాకూడదుటమ్మా'

'నేను కూడా హాస్పటల్‌కి వచ్చేస్తే బాబెలాగ బావా ?,' అన్నది అంటీ ముట్టనట్లు.

'బాబుని యింతమంది నౌఖర్లున్నారు యెవరో ఒకరు చూడకపోరు. నువ్వు మాతో బాటు రావాలి తల్లీ'

జయ అతని వైపు విసుగ్గా చూసింది: 'యేమిటి బావా ప్రొద్దుటే బోర్. నేను యిప్పట్లో హాస్పిటల్‌కి రాలేను. ప్లీజ్', జయ రెండు చేతులూ జోడించి నమస్కారం చేస్తూంటే యేమీ అనలేక పోయాడు.

భారతి అతన్ని దూరంగా తీసుకువెళ్లి అన్నది: 'క్రమంగా ఆవిడే హాస్పిటల్‌కి వస్తుంది. మీరు అడిగినకొద్దీ యెక్కువ అవడమేకానీ యిందులో లాభంలేదు'

కాళిదాసు మనసులో అనుకున్నాడు: 'చివరకి నీకు కూడా అర్థంకాకుండా పోతుంది' అని.

బాబు ముద్దు మురిపాలతో, తప్పటడుగులతో, వచ్చీరాని మాటలతో జయ మనసు పులకరించి పోతుంది. అసలే అందంగా ఆరోగ్యంగా పుట్టిన బాబు డాక్టర్‌గారింట అడ్వర్టైజ్ బొమ్మలాగు బొద్దుగా, ముద్దుగా తయారయేడు. గిరజాల జుట్టుతో తెల్లగా సీమదొరల పిల్లడిలా కొంచెం నీలంరంగుకి తిరిగిన కనుపాపలతో యెత్తుకుంటే మోయలేనంత వొళ్లుతో అదృష్టం అంటే భార

తీరే అనిపించేట్లువుట్టాడు. జయని క్షణం కూడా విడిచి పెట్టనివాడిని పంచప్రాణాలూ పెట్టుకుని కళ్లల్లో పాపమాదిరి జయలక్ష్మి వాడి బాధ్యతని పూర్తిగా తీసుకుని పెంచుతోంది.

'బాబాయ్! యివాళ మన రఘురావ్ యేం చేశాడో తెలుసా? బావా! బాబుకి అత్తా అనడం వచ్చేసింది. భారతీ, అదృష్టం అంటే నీదేనోయ్!' అంటూ సాయంత్రం రాగానే ముగ్గురినీ మూడు రకాలుగా పలకరిస్తుంది.

జయ రాఘవరావుగారికి తీరని సమస్య అయిపోయింది. బాబును దూరంచేస్తే జయ సాంబశివంవైపు మొగ్గు చూపుతుంది. సాంబశివాన్ని మరిచి పోవాలంటె జయలో ఈ ఆకర్షణ తప్పనిసరిగా వుండి తీరాలి. అనే తీర్మానానికి వచ్చేశారు.

బాబుకి మూడోయేడు ముద్దుముద్దుగా వస్తోందనగా భారతికి నెల తప్పింది. నెల తప్పింది మొదలు యింటిపని పూర్తిగా జయే చూసుకోసాగింది. క్లినిక్‌కి వెళ్లడం తగ్గించేశాక భారతి దగ్గరా, జయ దగ్గరా సమానంగా మాలిమి అయ్యేడు బాబు. 'పిన్ని అమ్మకి యింత పాప వుందేం పొట్టలో', అంటూంటే జయ వాడిని గుండెలకి అదుముకుని తనివితీరా ముద్దుల వర్షం కురిపిస్తుంది. జయ వాడి మొహంలోకి చూస్తూ వున్నట్టుండి కన్నీళ్లు కారుస్తుంది. 'నువ్వెందుకు పిన్నీ యేడుస్తున్నావు', అంటే 'లేదు బాబూ. నువ్వు బంగారు కొండవి. నువ్వు వుండగా నాకేం లోటు', అనుకుంటుంది చెంపల మీదుగా కారే కన్నీటిని తుడిచేసుకుంటూ.

జయలక్ష్మిని అబ్బురాన పెంచి పెద్ద చేసిన తల్లితండ్రులు వుండీ లేని వారయ్యేరు. మురిపించే లోకాలకి తీసుకు వెడతానని ప్రమాణాలుచేసిన సాంబశివం భారత దేశానికే దూరంగా విసిరివేయబడిపోయేడు. యిచ్చినట్లే యిచ్చి మాతృత్వపు మమతెలాంటిదో గ్రహించలేని స్థితిలో ఆ కోరికని మొదట్లోనే నరికివేశాడు, భగవంతుడు. జయ సంధ్యాసమయంలో వెండి గిన్నెలో పాలు తీసుకువచ్చి వాడి నోటికి చందమామని చూపించి అందిస్తూ, 'నా బిడ్డ వున్నా యింతవాడయ్యేవాడు' అనుకుంటుంది. అంతలోనే వాస్తవం గుర్తుకు వచ్చి 'ఛ! యిదేమిటి వీడుమాత్రం... వీడు మాత్రం పరాయివాడు కాదు' అని సమర్థించుకుంటుంది. వాడిని హృదయానికి ప్రేమగా హత్తుకుంటూంటే రాఘవరావు గారు కిటికీలోంచి చూడడం గమనించి యెన్నోసార్లు తప్పుకునేది పట్టుపడకుండా.

"మన తరం కాదు. యిక యింతే!' ఆయన వృద్ధాప్యంలో కుమిలింపు అది.

* * *

భారతి జయని పిలిచి అన్నది. 'నేను యింక యే విధంగానూ జీవితంమీద ఆశలు పెట్టుకోవడం లేదు జయా. నాకింక బ్రతుకుతాననే నమ్మకం పోయింది. ఆడదానికిది పునర్జన్మ అంటారు పెద్దలు. ఈసారి నాకు తెలుసు జరిగేదేమిటో. నాకు పుట్టిన పిల్లడిని రఘురావ్‌తో సమానంగా చూస్తావా జయా'

జయ నోటమాటరాని దానిలా వెర్రిగా చూస్తూండి పోయింది.

'నా బిడ్డల్ని యిద్దరినీ సరిగా చూస్తానని ఒక్కమాటయివ్వు. ఆ తృప్తితో చచ్చిపోయినా నేను విచారించను జయా!'

జయ కళ్లలో జలజలా కారేయి కన్నీళ్లు: 'నీకేమీకాదు భారతీ. నీ పట్ల దేవుడంత నిర్దయగా వుండడు. నువ్వన్నట్లు ఆ భయం స్త్రీకి మామూలే. డాక్టరువి నువ్వు. నువ్వే అంత బేజారైపోతే యెలా?'

ఆ రోజునుంచీ భారతిని యే చిన్నపనీ చేయనివ్వలేదు. నెలలు నిండినకొలదీ భారతి ఆరోగ్యాన్ని పుంజుకుంది. జయ వుత్సాహంతో బాబు పెంపకంలో యింటి పనులలో నిమగ్నురాలై పోయేది. భారతికి ఆరాత్రి సుఖంగా ప్రసవం జరిగింది. భారతి కన్నబిడ్డడు మొదటిసారిలాగే యెంతో అందంగా వున్నాడు. తల్లిపక్కనే మరో పాపని చూసి బాబు సహజంగా పిల్లలకుండే ఈర్ష్యని వ్యక్తం చేయకుండా వుండలేక పోయేడు. 'అమ్మా తమ్ముమ్మ లొట్టు. పిన్నికిచ్చెయి', అంటూ వాడు గుండెల్లోకి జరిగిపోతూంటే కాళిదాసు రెండుచేతుల్తోనూ అందుకుని వాడిని సముదాయించలేక సతమతం అయిపోయేడు.

'యిప్పుడైనా క్లినిక్‌కి రా తల్లీ' అన్నాడు కాళిదాసు

జయ అతనివైపు యిబ్బందిగా చూసింది: 'నీకు తెలీదా బావా. భారతి ఒక్కర్తీ యిద్దరి పిల్లలతో యింటిని చూసుకోవడం కష్టం కదూ'.

కాళిదాసు రాఘవరావుగారి వైపు చూశాడు. ఆయన జయలక్ష్మితో అన్నారు 'చూడమ్మా జయా: నేను యింకా క్లినిక్‌కి వెళ్లగలిగే స్థితిలో వున్నాననే అనుకుంటున్నావామ్మా, కాళిదాసు ఒక్కడి



వల్లా ఈ క్లినిక్‌పనుల్లా జరుగుతాయను కోకు నువ్వు యిప్పుడు యిలా సనుల వంకతో యింట్లో వుండిపోతే య నష్టమో ఆలోచించు' ఆయన మామూలు గానే అన్నారు. జయ ఈ సారి కొ భయపడింది. ఎప్పటికప్పుడు ఆయన మాటల్ని నిర్లక్ష్యం చేయడం న్యాయం కాదనిపించింది. కా వెనుకే బయలు దేరింది.

బాబు యిప్పుడు యింటిపట్టున వుండడం బహు తక్కువ. శని ఆదివా రాలు కాన్వెంటుకి సెలవలు యిస్తే పక్కింట్లోనో, పక్కవీధిలోనో గడిపేస్తుంటాడు. ఆ శని ఆదివారాల కోసమే జయ తహ తహ లాడిపోతూంటుంది. 'అబ్బ బయట బోల్డు పనులున్నాయి పిన్నీ! నువ్వేమో యింట్లోనే కూర్చోమంటావు. నేను వెళ్ళాలి' అంటాడు హీరో పోజు పెట్టి. అటువంటప్పుడు జయ బాధపడు తుంది. 'కన్నతల్లిని కాననే బాబు యింత నిర్లక్ష్యం చేస్తున్నాడు', అనుకుంటుంది మనసులోనే.

ఒంటరిగావున్న అనేక సందర్భాల్లో దిక్కులు పగిలిపోయేలా తలగడలో తల దూర్చి బావురుమని యేడుస్తుంది జయ కనిపించని సాంబశివం కోసం. రాఘవరావు గారు స్తోమతు వుండికూడా సాంబశివం ఆచూకీ తెలుసుకోలేక పోయేరు: 'భారత దేశంలో తనకోసం జయ కుమిలి కృశించి పోతోందని తెలిస్తే మాత్రం అతను రాకుండా వుండేవాడా', అనే ఆయన అంచనా.

బాబుని మరిపిస్తూ చిన్నారి మోహన్ జయవాళ్ళో పెరగడం ప్రారంభించేడు. జయ నవ్వుతూ భారతితో వినోదహ మాటంగా అనేది: 'చూడు భారతీ యిద్దరూ పసిపిల్లలే. యేమిటో నీడంటే నాకు 'యిది' లేదు.'

రఘురావుని చేరబిలిచి 'నీకు యెవరు కావాలిరా రామా', అనేవాడు కాళిదాసు.

రఘు తటెత్తకుండా, సెడవి కదప కుండా జయ వాళ్లోదూరి కొంగుఅడ్డంగా మొహానికి వేసుకునేవాడు.

భారతి నవ్వేసి 'చూడు జయా, నువ్వు నమ్ముతావో లేదో కాని బాబు లిద్దరూ నీ దగ్గరే వున్నా వాతెంతో తృప్తిగా వుంటుంది. నీమీద ప్రేమ అని కాదుగానీ నిన్ను వాళ్ళు కాదంటే నాకు మనసు చివుక్కు మంటుంది. నన్ను తల్లి అను కున్నా లేకపోయినా నువ్వు పిన్నివనే మమత వాళ్ళకి చిరస్థాయిగా వుండాలని నేను దేవు డిని ప్రార్థిస్తున్నాను', అనేది.

రఘూ, మోహన్ పోటీపడి చదివే వయ సుని సంపాదించుకున్నారు. యిప్పుడు రాఘవరావుగారి క్లినిక్ పూర్తిగా కాళిదాసు చేతుల్లోకి వచ్చేసింది. రాఘవరావుగారు యింటిపట్టునే వుంటూ విశ్రాంతి తీసు కుంటున్నారు. ఈ ఏడెనిమిదేళ్ళ కాలం లోనూ ఆయన స్వంత కూతుళ్ళు మన వలూ వచ్చి రెండేసినెలలు వుండి మరీ వెళ్ళేరు తండ్రి చేసిన యే పని ఆ పిల్లలు వేలెత్తి చూపించరు. ఆయనకు తెలుసు. జీవిత విధానం యేమిటో అనే నమ్మకంలో వుండిపోయిన సహృదయులు, తండ్రి రక్తాన్ని పంచుకుపుట్టిన ఆ యిద్దరప్ప చెల్లెళ్ళూ వున్న నాలుగురోజులూ కాళి దాసుని స్వంత అన్నదమ్ముడికన్నా యెక్కువ గానే చూశారు.

జయ వొంటరిగా గదిలో వున్నప్పుడు ఆవిడ గదిలోకి వెళ్ళి ఆ రోజు ప్రప్రథ మంగా అన్నారు: 'చూడమ్మా జయా! యిప్పుడు మించిపోయింది యేమీ లేదు, తప్పులు అందరూ చేస్తారు. నువ్వు తెలి యక చేశావు. తెలిసి తెలిసీ యెంతో మంది పాపిష్ఠిపనులు చేస్తూ వుంటే దాన్నెవరు నిలదీసి అడుగుతున్నారు చెప్పు. నువ్వొక యింటిదానివి అవుతే'

'బాబాయ్', జయ కలవరపడి పోయింది: 'మీరేనా బాబాయ్ ఈ మాట అంటున్నది. నేనా యిప్పుడు పెళ్ళి చేసుకోవడమా? యిదేమైనా న్యాయంగా అనిపిస్తోందా మీకు.'

కాళిదాసు అప్పుడే గదిలోకి అడుగు పెట్టి సమయంవచ్చింది కనుక రాఘవ రావుగారి మాటని సమర్థించేడు.

జయ అతనివైపు తీక్షణంగా చూసింది: 'నువ్వేమిటంటున్నావు బావా! నేనా! పెళ్ళి చేసుకోనా? యెవర్ని. మనం దిద్దుకున్న తప్పుల్ని యెవరూ గుర్తుపట్టలేరనే కదా నీ ధైర్యం. యెవరు గుర్తించినా, లేకపోయినా పైనున్న వాడినెలా తప్పించు కోగలం. నేను చేసినపని మీరు దయ నీయంగా సమర్థించినా నిజాన్ని నేను చస్తే దాచను బావా! అయినా నాకు పెళ్ళే మిటి?'

రాఘవరావుగారు ఆప్యాయంగా అన్నా- 'నిజమే జయా నువ్వు అన్నట్టు మన- చేసిన తప్పిదం కప్పిపుచ్చడం ధర్మంకాదు. ఈ విషయాన్ని చెప్పేసి యెవరైనా యిష్ట పడితే అలాగే నిశ్చయం చేద్దాం.'

జయ పరుగున వచ్చేసి ఆయన కాళ్ళని చుట్టేసింది: 'ఒద్దు బాబాయ్! నేనా నరకం భరించలేను. నిమిష నిమిషం చస్తూ బతికే ఆ చేదు జీవితం నాకు వొద్దు. సాంబశివం వున్నాడు. నా కోసం అతను యెప్పటికైనా తిరగివస్తాడు అనే భ్రమలో రేపు మీది ఆశతో వూపిరి పోసు కుని బతుకుతున్నాను. నన్ను వదిలేయండి బాబాయ్. మీకంత బరువైపోయేనా నేను' గుండెలు బద్దలయ్యేలా యేడుస్తున్న జయని చూస్తూంటే ఆయన హృదయం ముక్కలైపోయింది. జయ మానసిక స్థితిని ఆయన కుణ్ణంగా అర్థం చేసుకోగలిగేరు. కాళిదాసు వైపు ఒక్కసారిచూసి మౌనంగా బయటికి నడిచేరు.

కాళిదాసు మరదలికి దగ్గరగా వచ్చి అన్నాడు: 'డాక్టర్ చంద్రవదన్ ఈ మధ్యే భార్యని పోగొట్టుకున్నాడు జయా. ఆయ నకీ పిల్లలున్నారు. నా ఈడువాడే. యిం దులో బలవంతం యేమీ లేదు. తన యిద్దరి పిల్లలకీ తల్లి కావాలనే తప్ప తనకి భార్య కావాలనే పాడు వుద్దేశ్యం అతనికి లేదు. నువ్వు లోకాన్నిగురించి ఆలోచించడం మానుకున్నావు. కొంతవయసు వచ్చేక ఆడా మగా బేధం లేదు, పెళ్ళి తప్పనిసరిగా చేసుకునేందుకు. యెన్నాళ్ళైనా యిదే జీవితం. కొంచెం మార్పు కావాలి ప్రాణికి. అందుకే మనవాళ్ళు దీనికి అందంగా 'పెళ్ళి' అన్నారు. నువ్వు నన్ను అర్థం చేసుకో.

'బావా!'

'నీ బాధ నాకుతెలుసు జయా! నన్నేం చేయమంటావు? సాంబశివం యెక్క డున్నాడని వెతికి పట్టుకోను? అతను కోర్సు పూర్తి చేసుకున్నట్టు తెలిసిందే కానీ అక్కడే వున్నాడో మరెక్కడున్నాడో

యిలాగ తెలుసుకోవడం. నాకు శక్తివున్నంత వరకూ నీకోసం యేది చేసేందుకైనా సిద్ధంగా వున్నాను. అప్పుడే కాదు జయా యెప్పటికీ నీకు అన్నలా నేను అండగా వుండగలను. కానీ లోకం వూరుకోదు. అనవసరంగా నిందలు వేస్తుంది. యెన్నో ళ్ళని భరించగలవు?'

'సంఘం దృష్టిలో యెన్నేళ్ళు దోషిగా వుంటావు. అతను వుత్తముడు. నీగురించి విన్నాడు. యిందులో నీ తప్పేం వుంది? నువ్వే అటువంటిదానవైతే యింత కుమిలి పోయే దానివేకాదు.'

జయ మౌనంగా వింటోంది.

'నువ్వో డాక్టరువే. నీ కాళ్ళమీద నువ్వు ధైర్యంగా నిలబడగలిగే శక్తి భగవంతుడిచ్చేడు నీకు. నా అధీనంలో వున్నందుకు బలవంతం చేస్తున్నాననే అపోహలు లేవు యిందులో. నీ బ్రతుకిలా భగ్నం అయిపోకూడదు. తెలియకచేసిన తప్పుకు యింత శిక్షా...వీల్లేదు జయా! న్యాయం, సంఘం యేమనుకున్నా నాకు యిబ్బంది లేదు. చంద్రవదన్‌తో రేపే మాట్లాడు తాను.'

'నా బ్రతుకు యింత త్వరగా ముగుస్తుందనుకోలేదు బావా', జయ తాపీగా అన్నది.

అదిరపడ్డాడు కాళిదాసు: 'యేమిటమ్మా నువ్వనేది ?'

'అంతే బావా! పెళ్లి చేసుకోవాలనే కోరిక నాకు యేమాత్రం లేదు. పదిమందిలో వటాటోపంగా తిరగాలనే వుబలాటం లేదు. ఈ బ్రతుకు మీ అందరిముందూ వెళ్లిపోతే యింతకుమించి నేను కోరుకునేది లేదు.'

'యిదేం ధోరణి జయా!'

'అదంతే. నేనెంత పొరబాటు చేశాను. చేసిన ఈ తప్పిదాన్ని నువ్వూ డాక్టరుగారూ ప్రేమాభిమానాలు చంపుకోలేక అందంగా సమర్థిస్తున్నారు. నేనెంత దెబ్బ తిన్నాను. ఆ సంగతి ఆలోచించేవా ?'

'ప్రపంచంలో యెవరూ తప్పుచేయడం లేదనే నువ్వు అనుకుంటున్నావా జయా. నీలాంటి దురదృష్టవంతులు మరెక్కడా వుండరనే నీవూహ. సాంబశివం నమ్మాలి కన్న తల్లి.'

'వాళ్లసంగతి మరెందుకులే బావా! యింతపెద్ద కష్టం మరో ఆడపిల్లకి... ఒద్దు ఆ వూహకూడా వొద్దు. అందరి ఆడపిల్లలకీ అపురూపం అయిన జీవితమే కావాలని నేను మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను. అతనిసంగతి,' అని ఆపేసింది.

'నా మాట విను జయా! నీ విషయం చంద్రవదన్ అర్థం చేసుకున్నాడు.'

'పిచ్చిబావ! ఆడపిల్ల మంచిది కాదని తెలిసే త్యాగంచేసే మగవాళ్లంటే నాకు యిష్టం లేదు. నేను చేసిన తప్పుకి శిక్ష నన్నే అనుభవించనీ. ఒకళ్ల దయా దాక్షిణ్యాల మీదా, సానుభూతిమీదా బ్రతకడం అంటే నాకు పరమ అసహ్యం.'

'యిలా యెంతకాలం అవి ?'

'నీకు భారంగా వున్నానా బావా ? యెవరూ నన్ను గుర్తుపట్టని చోటికీ, యెవరికీ నా వునికి తెలియని చోటికి వెళ్లిపోవాలని యెప్పటి కప్పుడే అనుకుంటు న్నాను. కానీ నీ కొడుకు రఘురామ్‌వల్ల నాకు తెలియకుండానే బ్రతుకుమీద మమత పెంచుతున్నాడు. వాడిని వదిలి ఒక్కక్షణం కూడా వుండలేనేమో అనిపిస్తోంది. బావా!' జయ పిలుపులో యెంతో దేవిరింపు కనిపిస్తోంది.

'యేమిటి'న్నట్లు చూశాడు కాళిదాసు.

'నువ్వు నన్ను యింత ప్రేమగా చూస్తున్నావు. కన్న తల్లి తండ్రులకే భారం అయిపోయిన నేను నీ ప్రాణానికి




గుదిబండలా తయారౌతాను అనిపిస్తొంది. నావల్ల నీకెంత దుఃఖం.'

కాళిదాసు ప్రేమగా జయ శిరస్సుమీద చేయివేశాడు. అతనికి ఆ ఘడియలో నోటి వెంట మాట రాలేదు. నెమ్మదిగా అన్నాడు: 'యిది నా బాధ్యత. నాకే ఓ చెల్లెలు వుండివుంటే ఆ చెల్లెలే యిలా అయిపోతే అది బాధ్యతే అనుకునేవాడిని కానీ గుదిబండ అనే ధ్యాసలో వుండేవాడిని కాను'

'బావా! రఘురామ్‌ని తీసుకుని ఈ వూరువదిలి వెళ్లిపోతాను బావా!'

అతను వులిక్కిపడ్డాడు.

జయ గ్రహించిన దానిలా 'నాకుతెలుసు రక్తాన్ని పంచుకుపుట్టిన నీ బిడ్డని నాకు యిచ్చేంత ధైర్యం నీకు వుండదు. నీ ప్రేమ ... నా విషయంలో కొంతవరకే కుదించుకుపోయింది' అన్నది.

'నువ్వు నన్ను అర్థం చేసుకోవడం లేదు జయా. ఆ భావం నా కసలు లేదు. బాబుని నీకన్నా శ్రద్ధగా ప్రేమగా వాళ్లమ్మ కూడా చూస్తుందంటే నేను వొప్పుకోను. భారతి నామాట యెప్పుడూ జవదాటదు. కానీ నువ్వు వాడితోవుండడం ప్రారంభిస్తే అందరూ యేమనుకుంటారు ?'

'నా కొడుకే అని'

'చూశావా! నిజం యెంత సూటిగా బయటికి వచ్చేస్తుందో. ఈ మాట వినకూడదనే కద మనం యింత ప్రయత్నం చేశాం. నువ్వు మళ్లీ మొదటికొస్తున్నావ్. నాదీ, డాక్టర్‌గారిదీ శ్రమ వృథా కాకూడదు జయా!'

జయ ఆపైన మాట్లాడలేదు.

కాళిదాసు ప్రయత్నాలు ఫలించలేదు. జయ తలుచుకున్నదంటే అన్నంతపని చేసి తీరుతుంది. ఆపిల్ల జీవితాన్ని మూడు నాళ్ల ముచ్చటగా చేయడం అతనికి యేమాత్రం యిష్టం లేదు. స్టెతస్కోపు భుజాన వేసుకుని హాల్లోకివచ్చి భార్య గదిలో ఆగి ఆవిడకి చెప్పేసి, రాఘవరావు గారితో 'మరి నేను క్లినిక్‌కి వెళ్తొస్తాను బాబుగారూ', అంటూ గారేజ్ వైపు దారితీశాడు.

(ఇంకావుంది)




స్ప్రింగుడోరు తెరుచుకొని లోపలి గదిలోకి అడుగుపెట్టిన సువర్ణ అప్రయత్నంగానే అడుగు వెనక్కి వేసింది. 'అన్నయ్యా!' అనుకుంటూ.

చప్పుడుకు తలత్రిప్పి చూశాడు డాక్టర్ కృష్ణమోహన్.

చప్పున సువర్ణ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. చిన్నగా నవ్వింది.

మొహం తిప్పేసుకున్నాడు కృష్ణమోహన్.

'నీ విజిటింగ్ కార్డు చూస్తూనే కొద్దిగా అనుమానించానుగాని నువ్వే అని అనుకోలేదు. యింతకూ ఏవిషయం కన్సల్టు చెయ్యాలని వచ్చావు?'

చిన్నబుచ్చుకున్న మొహంతో మాటా పలుకూలేకుండా అల్లాగే నిల్చుండిపోయింది సువర్ణ.

'రియల్లీ అయామ్ సో సారీ మిసెస్ హరిప్రసాద్. క్షమించాలి. యిలా వచ్చి కూర్చోండి.' కుర్చీ చూపించి ఎదురుగ్గా వున్న పుస్తకంలోని పేజీలను త్రిప్పుతూ అన్నాడు కృష్ణమోహన్.

'అన్నయ్యా! నేను...నేను నీ చెల్లాయిని...'

చివ్వున తల ఎత్తాడు కృష్ణమోహన్.

'మా చెల్లాయి చనిపోయి చాలరోజా లయిపోయింది. పైగా యింకోవిషయం. యిది నా కన్సల్టింగ్ రూము. నేను యిక్కడ డాక్టరునేగానీ ఎవ్వరికీ అన్నయ్యను కాను.' గంభీరంగా చెప్పాడు కృష్ణమోహన్.

గుండెల్లో పొంగుతున్న బాధంతా కన్నీళ్ళరూపంలో రాబోయిందిగాని అభిమానం అడ్డొచ్చింది. కన్నీళ్లను అదిమి పట్టి వెళ్ళి కూర్చుంది సువర్ణ.

'మీ 'శ్రీవారికి' ఏం జబ్బు?' అదో విధంగా 'శ్రీవారు' అనేచోట వ్యంగ్యంగా

వతి పలికాడు కృష్ణమోహన్.

అతడి మాటల్లోని వ్యంగ్యాన్ని గుర్తించినా ఊరుకుండిపోయింది సువర్ణ.

'కాన్సర్' అతి మెల్లిగా, శాంతంగా అంది సువర్ణ.

ఎదురుగ్గావున్న పేపరుమీద ఏదో వ్రాస్తున్నట్లు అభినయిస్తున్న వాడల్లా చటుక్కున తలెత్తాడు కృష్ణమోహన్.

తల దించుకొని కూర్చున్న సువర్ణ తెల్లటి పాపిటలోని ఎర్రటి కుంకుమ మరింత ఎర్రగా కన్పించింది.

చెల్లెలి ముఖాన్ని తేరిపార చూడాలనుకుంటూవుండేనే సువర్ణ తలెత్తింది.

అతి ప్రయత్నం మీద బలవంతంగా చూపుల్ని త్రిప్పేసుకున్నాడు కృష్ణమోహన్.

బ్యాగ్ తెరిచి మడతపెట్టి వున్న లేత పిలంరంగు పల్చటి కాగితాన్ని తీసియిచ్చింది సువర్ణ.

కావల్సినంత నిర్లక్ష్యాన్ని ప్రదర్శిస్తూ అందుకుని విప్పాడు కృష్ణమోహన్.

బొంబాయిలోని డాక్టరు జగన్మోహన్ వ్రాసియిచ్చిన రికమెండేషను లెటర్ అది.

పూర్తిగా చదివి తిరిగి యిచ్చేస్తూ అన్నాడు కృష్ణమోహన్.

'అయామ్‌సారి! ఈ కేసు నేను హ్యాండిల్ చెయ్యలేను' అని.

తలెత్తి మాటిగా కృష్ణమోహన్ కళ్లల్లోకి చూసింది సువర్ణ.

'అన్నయ్యా!' ఆర్ద్రంగా పిలిచింది.

'అయామ్ వెరీసారి' నాటకంలోని పాత్రలా చెప్పేసి లేచినిల్చున్నాడు కృష్ణమోహన్.

'మీరు మరో డాక్టరును కల్పుకోండి.' అన్నాడు.

తెలియకుండానే సువర్ణ చెంపమీదకు నీళ్లు జారాయి.

'నువ్వు చనిపోయిందనుకున్నా నేను చనిపోలేదన్నయ్యా. నేను యింకా బ్రతికే వున్నాను. వారిని బ్రతికించన్నయ్యా!'

కళ్లు త్రిప్పి చూశాడు కృష్ణమోహన్.

'బ్రతికించడానికి నేనేమన్నా దేవుణ్ణనుకుంటున్నావా? ... మామూలు డాక్టర్ని. మానవ మాత్రుణ్ణి.'

'నువ్విలా అనడానికి వీల్లేదు.'

'హుఁ' చిన్నగా నవ్వాడు కృష్ణమోహన్. 'ఎందుకు వీల్లేదు? నాకిష్టంలేని కేసును ఏనాడూ తీసుకోను నేను. నా యింట్లోంచి అడుగుపెట్టిన మరుక్షణమే నాయింట్లో నీకు స్థానంలేకుండా పోయింది. మర్చిపోయిన సంబంధ బాంధవ్యాల్ని గుర్తు చేసుకోడానికి నాకు వ్యవధి లేదు. నువ్వు మరో డాక్టరును చూసుకుంటే చాల సంతోషం.'

సువర్ణ కళ్లు ఎర్రబడ్డాయి అయినా మెల్లిగా అంది.

'సరె నేను నీ చెల్లాయిగా అర్థించడం లేదు. చావు బ్రతుకుల్లోవున్న ఓ పేషంటు భార్యగా పసుపు కుంకుమలకోసం ఆరాటపడే ఓ స్త్రీగా ప్రార్థిస్తున్నాను.'

నిర్లక్ష్యంగా నవ్వాడు కృష్ణమోహన్.

'నీ పసుపు కుంకుమల్ని కాపాడేందుకు నేను దేవుణ్ణికానని ముందే చెప్పాను. మామూలు డాక్టర్ని.నీ భర్తకు ఆయుష్షు లేకపోతే నేనేం చేసినా చస్తాడు. ఆయుష్షు వుండి నేను చూడకపోయినా బ్రతుకుతాడు. అయినా నేను కేసు తీసుకోనప్పుడు నాకెందుకిదంతా? నేను తీసుకోవడంలేదు.' ఖచ్చితంగా చెప్పేశాడు కృష్ణమోహన్.

'అంతేనా?'

'అంతే!'

రోషంగా చూసింది సువర్ణ.

'ఛీ! నువ్వు డాక్టరువేకాదు మనిషివి కూడ కాదు. డాక్టరు చెయ్యవలసిన విద్యుక్త ధర్మమేకాదు మనిషికుండవలసిన మానవత్వంకూడ లేదు. పంతాల కోసం ఓ నిండు ప్రాణంపోతూవున్నా చూడగలవు. ఒకవేళ ఆయనచస్తే...' గొంతు వణికింది సువర్ణకు 'ఉహూఁ ఆయన్ను చావనివ్వను. వస్తాను.' విసురుగా గుమ్మం అవతల అడుగు పెట్టబోతున్నది 'సువర్ణా!' అన్న పిలుపుకు చటుక్కున ఆగి వెనక్కితిరిగి చూసింది.

అవతల గుమ్మంవైపు ఆర్ద్రనయనాలతో వదిన నిల్చొనివుంది. చెలియలికట్టతెగిన సముద్రుడిలా పొంగింది దుఃఖం సువర్ణకు.

క్షణంలో 'వదినా! అంటూ వాలిపోయేదే దూరంగా నిల్చున్న కృష్ణమోహన్ మాటలతో ఆనకట్ట వెయ్యకపోయివుంటే.

'పద్మా! అది నా చెల్లాయి సువర్ణ కాదు. మిసెస్ సువర్ణా హరిప్రసాద్... నాదగ్గరికి వచ్చె ప్రతిపేషెంటుతో నువ్విలా మాట్లాడటం నాకు నచ్చదు' గంభీరంగా అన్న కృష్ణమోహన్ మాటలు ఎక్కడివారి నక్కడే నిలబెట్టేశాయి.

కళ్లెత్తి కృష్ణమోహన్‌వైపు చూసిన సువర్ణ అప్రయత్నంగానే అనుకుంది.

'అన్నయ్య...అంత సున్నిత హృదయుడైన అన్నయ్య... 'చెల్లాయ్! నువ్వు లేకపోతే ఈ అన్నయ్య లేడమ్మా!' అనే అన్నయ్య యింతగా మారిపోయాడా?'

'పద్మా! నువ్వు లోపలికివెళ్లు.' అన్న కృష్ణమోహన్ మాటలకు మరీ ఈ లోకంలోకి వచ్చింది సువర్ణ.

కళ్లు తుడుచుకుంటూ లోపలికెళ్లిపోయింది పద్మ.

చిన్నగా నిట్టూర్చి గుమ్మం అవతల కాలుపెట్టింది సువర్ణ. పదేళ్లకుముందు కూడ యిల్లాగే నిట్టూర్చి కాలు బయట పెట్టింది. కాని యిప్పుడు అంతకంటే భారమైన హృదయంతో గిజగిజలాడిపోతోంది.

ఎదురుగ్గా వస్తున్న టాక్సీని ఆపి ఎక్కికూర్చుంది. వద్దనుకున్నా కృష్ణమోహన్ కఠినమైన మాటలే గుర్తుకు రాసాగాయి.

'నిజంగా అన్నయ్య మరీ యింతగా మారిపోయాడా?' నమ్మశక్యం కానట్టు తనలోతనే గొణుక్కుంది.

సరిగ్గా పదేళ్లకు ముందు...

* * *

'వదినా! ఒక్కసారి యిలా వస్తావా? మధ్యహాల్లో కూర్చొని క్షణంముందు కాళ్లకు పెట్టుకున్న పట్టీగజ్జెల అందాన్ని అవి తన పచ్చని పాదాలకు అదనంగా యిస్తున్న అందాన్ని తనివితీరా చూసుకుంటూ ఓ కేకవేసింది సువర్ణ.

లోపలివైపు ఓసారి చూపులు పారించి మరీ పాదాలవైపు చూసుకుంది. పల్చటి తెల్లటిపాదాలు సన్నటి పొడవైనవ్రేళ్లు. గులాబీ రంగులోవున్న గోళ్లకి ఎర్రటి క్యూటెక్సు వెయ్యడంవల్ల మరింత అందంగావున్నాయి. పట్టీగజ్జెల అందంతో యింకా అందంగా వున్నాయి పాదాలు.

తనపాదాల్ని, గజ్జెల్ని చూసుకొని తనే మురిసిపోసాగింది. పట్టుపరికిణీ కుచ్చెళ్లని మడమలమీదికి అలా ఎత్తిపాదాల్ని చూసు

కుంది. అలా లేచి అటునుండ యిటు; యిటు నుండి అటు ఒయ్యారంగా నాల్గు అడుగులు వేసింది. లయబద్ధంగా అయిన గజ్జెల శబ్దానికి తనే నవ్వుకుంది.

అంత సంతోషాన్ని తను ఒక్కతే భరించలేక మరీ యింకోకసారి కేకవేసింది 'వదినా?' అని.

పద్మ సువర్ణకంటే ఓ రెండు మూడేళ్ళే పెద్దదయినా సువర్ణకు తనలో మాతృమూర్తిని చూపించింది. పన్రెండేళ్ళ వయసులో వున్నప్పుడే తల్లిపోయినా, యిరవై ఏళ్ళ కృష్ణమోహన్ తన ప్రేమతో తండ్రినీ, తల్లినికూడ మరిపించాడు.

సువర్ణ ఒక్కక్షణం అలిగితే కృష్ణమోహన్‌కు ప్రపంచమే ఆగిపోయినట్లు తోచేది.

సువర్ణ ఏదో పిక్చరుచూసి అందులో హీరోయిన్ వేసుకున్న గజ్జెల్ని చూసి, 'అవి బావున్నాయి కదన్నయ్యా!' అన్నందుకు మరుసటిరోజు సాయంత్రానికంతా చెల్లెలి పాదాల్ని గజ్జెలతో అలంకరింపజేశాడు.

'ఛ! ఎంతసేపు పిలిచినా ఏం చేస్తున్నావు వదినా?' అందంగా విసుక్కుంటూ తలెత్తిన సువర్ణకు గుమ్మంలో నిల్చున్న వ్యక్తి కన్పించాడు

మడమల మీదకువున్న పరికిణీ కుచ్చెళ్లను చటుక్కున పాదాలమీదకు తోసేసి లేచి నిల్చుంది సువర్ణ.

ఎదురుగ్గా నిల్చున్న వ్యక్తి ఎంతసేపటి నుండి గమనిస్తున్నాడో చిన్నగా నవ్వుతున్నాడు.

సువర్ణ మొహం చిట్లించుకుంది. కట్టిగానే అడిగింది.

'ఎవరు కావాలండీ మీకు?' అని.

అటువైపు వ్యక్తి చిరునవ్వు నవ్వడం మానలేదు.

'కృష్ణమోహన్ వున్నాడా?'

ఆశ్చర్యంగా చూసింది సువర్ణ.

యింతకుముందు కృష్ణమోహన్ కోసం ఎవరు వచ్చినా 'డాక్టరుగారు వున్నారా?' అనో, 'బాబుగారు వున్నారామ్మా?' అనో అడిగేవాళ్ళేగాని మరి యింత యిదిగా, అందులో ఏకవచన ప్రయోగంతో పిలిచే వాళ్ళు ఎవ్వరూ లేరు. మరి...

# నష్టజాతకుడు

మెల్లిగా అంది. 'లేరు. హాస్పిటల్ కెళ్ళాడు' అని.

'ఓహ్!' వాచీ చూసుకున్నాడు అతను.

'మరీ ఎప్పుడు వస్తాడు?'

'ఆరుగంటల తర్వాత......'

'అయితే తర్వాతే వస్తాను చెప్పండి.' అంటూనే మరింకోమాట అడిగేందుకు వ్యవధి అయినా యివ్వకుండా గబగబా అడుగులు వేసుకుంటూ వెళ్లిపోయాడతను.

వెళ్తున్న అతన్నే చూస్తూ నిలబడి పోయింది సువర్ణ.

రాత్రి కృష్ణమోహన్ రాగానే చెప్పింది.

'ఎవరమ్మా అతను?' నవ్వాడు కృష్ణమోహన్.

'నాకేం తెలుసు?' 'చెప్పండి' అన్నాడు. చెప్పాను. భలే గమ్మత్తయిన మనిషిలా వున్నాడులే. మొహాన చిరునవ్వుని మాత్రం మాసిపోనివ్వలేదు.'

'పేరడిగావా?'

'ఉహుఁ. అడగలేదు... అసలు ఆయన చెప్పందే.'

'బాగుంది. నువ్వు అడగిందే నాపేరు 'యిదీ' అని ఎవరైనా చెప్పుకుంటారామ్మా.'

'ఎందుకు చెప్పుకోరు? నీదగ్గరికివచ్చే పేషంట్లందరూ 'నాపేరు యిదీ. యిలా నేను వచ్చిపోయానని బాబుగారికి చెప్పండమ్మా.' అని చెప్పరూ?'

'బహుశా యితను పేషంటు కాదేమో.'

పకపకా నవ్వింది సువర్ణ.

'యింకా మేలు. పేషెంటేమిటి ఖర్మ చిన్న వస్తాదులా వున్నాశ్లే.'

బయట స్కూటర్ ఆగినచప్పుడుకు యిద్దరూ తలత్రిప్పారు.

'అరె! మనిషి స్కూటర్ మీదొచ్చాడే?' కళ్ళు విచిత్రంగా తిప్పింది సువర్ణ.

సువర్ణ మాటల్ని కృష్ణమోహన్ విన్నాడో లేదో గాని జవాబేం చెప్పకుండా బయటికి వెళ్లిపోయాడు.

'కమాన్! కమాన్ భాయ్! నువ్వేనన్న మాట వచ్చింది. మా చెల్లాయి వర్ణించి వర్ణించి చెప్తూ వుందిలే నీ ఆకార విశేషాల్ని...' అంటూనే లోపలికి తీసుకొచ్చాడు.

లేచి నిల్చుంది సువర్ణ.

చిన్నగా నవ్వాడు హరిప్రసాద్.

కృష్ణమోహన్ సువర్ణను, పద్మను కూడ పరిచయం చేశాడు.

చిన్ననాటి ముచ్చట్లన్నీ అయిపోయిన తర్వాత వెళ్ళడానికి లేచి నిల్చున్నాడు హరిప్రసాద్.

'అప్పుడే వెళతావేమిట్రా! కూర్చో. భోంచేసి వెళ్దువుగానిలే' అన్నాడు కృష్ణమోహన్.

'అవునండీ. భోజనాల సమయంలో వూరికే వెళ్లిపోవడం ఎందుకు? భోంచేసి వెళ్ళండి' అంది పద్మావతికూడ.

యిబ్బందిగా చూశాడు హరిప్రసాద్.

'వద్దు మోహన్! నాకు అలవాటు లేదు. ప్లీజ్! మరేం అనుకోకు. వెళ్తాను.'

కొద్దిగా ఆశ్చర్యంగా చూశాడు కృష్ణమోహన్.

'అరె. నువ్వింకా మారలేదేమిట్రా. నువ్వో ఫూల్‌వి. మా యింట్లో అల్లాంటి ఆచారాలేం లేవు. పద పద...పద్మా! వడ్డించు త్వరగా' అని లోపలికి కేకేశాడు.

యిక మరి బావుండదని భోజనాని కూర్చొన్నాడన్న మాటేగాని ఫ్రీగా తినలేకపోయాడు హరిప్రసాద్.

హరిప్రసాద్ వెళ్లిపోయాక చిలిపిగా అంది సువర్ణ.

'అదేమిటన్నయ్యా! నీ ఫ్రెండు మరి మొహమాటస్థుడిలా వున్నాడే. 'ఎంత మొహమాటమైనా మరీ యింత అన్నం వేస్టు చేసిపోతాడా?' అంది.

'ప్చ్! వాడో నష్టజాతకుడులే.' కొద్దిగా విట్టూర్చాడు కృష్ణమోహన్,

ఆశ్చర్య పోయింది సువర్ణ,

తెల్లగా, పొడుగ్గా, బలంగా ఆరోగ్యంగా వుండి, లక్షణంగా యింజనీరు వుద్యోగం చేసుకుంటున్న ఆ వ్యక్తి నష్టజాతకుడా?' అని.

ఎంత ఆలోచించినా అర్థం కాలేదు సువర్ణకు.

'ఒకవేళ ప్రేమించి పెళ్లిచేసుకుంటె భార్య చనిపోయిందేమో!' తన ఆలోచనకు నవ్వుకుంది సువర్ణ.

మరీ అంత అందమైన మనిషి నష్టజాతకుడంటె కాస్త జాలికూడ వేసింది,

# నష్టజాతకుడు

తామరాకు హరిప్రసాద్ రాకపోకలు ఎక్కువయ్యాయి. ఆరని జ్యోతిలాగ ఎప్పుడూ చిరునవ్వు నవ్వుతూ వుండే హరిప్రసాద్ మొహంలో వెతికి చూద్దామన్నా ఓ మలినరేఖ కూడ కన్పించేదికాదు. ఒక్క క్షణం కూడ అతనిమొహం బాధగా వుండేదికాదు. 'యితనికేం బాధలులేవే! మరి అన్నయ్య నష్టజాతకు డన్నాడేం?' అనికూడ అనుకుంది చాలసార్లు.

ఓ రోజు సాయంత్రం ఆవరణలో కుర్చీలు వేసుకొని చల్లగాలిలో కూర్చున్నారు అందరూ.

మాటలమధ్యలో వున్నట్టుండి అడిగాడు కృష్ణమోహన్.

'యింకా ఎన్నాళ్ళురా యీ బ్రహ్మచారి జీవితం? హాయిగా పెళ్లి చేసుకోరాదూ?' అంటూ.

చిన్నగానవ్వి వూరుకుండి పోయాడు హరిప్రసాద్.

సుపర్ణ మాత్రం ఆశ్చర్యపోయింది.

'యించుమించు అన్నయ్య వయసులో వున్న యీయన యింకా పెళ్లి చేసుకోలేదా?' సోని.

ఆ రోజురాత్రి పద్మావతి అడిగింది.

'మీ ఫ్రెండుకు అమ్మాయి లెవరూ దొరకలేదా? లేక తన అందానికి సరైన అమ్మాయి యింకా కన్పించలేదా?' అని.

కృష్ణమోహన్ నిట్టూర్చాడు.

'లోకం ఒక్క అందాన్ని, గుణాన్ని, చదువునేకాదు, దమ్మిడీ విలువలేని కులగోత్రాల్ని కూడ చూస్తుంది. అందుకోసమే వాడికింకా పెళ్లికాలేదు.'

'అంటే!' అర్థం కానట్లు చూపింది పద్మ.

'అంటే, ఏంలేదు. వాడికి అమ్మానాన్న ఎవ్వరూలేరు. అనాధాశ్రమంలోనే పెరిగాడు; తెలివైనకుర్రాడు కాబట్టి అనాధాశ్రమం వాళ్లే యస్. యస్. యల్. సి. వరకు చదివించారు. మెరిట్ స్కాలర్‌షిప్పుతో కాలేజీలో చేరాడు. అక్కడ నాకు వాడితో పరిచయం అయ్యింది. మా రూములోనే వుండేవాడు మంచి యింటలిజెంట్ ఫెలో. మంచి సంస్కారవంతుడు కూడ. తన హృదయంలో అగాధాలున్నా ఎప్పుడూ పైకి నవ్వుతూ వుండేవాడి మనస్తత్వం నాకు మరీ నచ్చింది. యిద్దరం మంచి ఫ్రెండ్సుగా మారిపోయాం. తర్వాత వాడు బి. ఇ. లో చేరాడు. నేను యం. బి. లో చేరాను. వాడి హాస్టలు, నా హాస్టలూ వేరయినా ఆదివారాలు టవున్‌లో కలుసుకునేవాళ్లం. వాడికి మెరిట్ స్కాలర్‌షిప్పువున్నా అప్పుడప్పుడు డబ్బు అవసరమయ్యేది. వాడికి నేను సర్దేవాణ్ణి. యిప్పుడు వాడు యింజినీరైనా వాడికి పిల్లనిచ్చేందుకు భయం.' మెల్లగా చెప్పాడు కృష్ణమోహన్..




కృష్ణమోహన్ విషాదగాథతో వాతావరణం కాస్త గంభీరంగా మారిపోయింది.

'ఏమిటో నమ్మలేకుండా వున్నాను.' బాధగా అంది పద్మ.

సుపర్ణ అసలే నమ్మలేక పోయింది.

పడుకున్నా కృష్ణమోహన్ చెప్పిన విషయాలే జ్ఞాపకం వస్తున్నాయి.

'అయితే హరిప్రసాద్ అనాధా?' పదే పదే అనుకుంది. కాని నమ్మలేకపోతూ వుంది. తెల్లటి పాలరాతి విగ్రహంలా, హుందాగా వున్న అతను ఓ అనాధ యువకుడా?...పాపం హరిప్రసాద్ పైకి నవ్వుతూవున్నా మనసులో ఎంత బాధ అనుభవిస్తున్నాడో.'

ఆ క్షణంలోనే హరిప్రసాద్ అంటే ఓ విధమైన భావం నాటుకుపోయింది.

ఆ మరుసటిరోజు హరిప్రసాద్ వచ్చాడు. ఆ మరుసటిరోజు కూడ వచ్చాడు. ఆ తర్వాత చాలాసార్లు వచ్చాడు. ప్రతి నిముషం అతన్ని పరీక్షగా చూసేది సుపర్ణ. అతనిలో ఏలాంటి అవలక్షణం కన్పించకపోగా అదోవిధమైన ఆప్యాయత కూడా కలగసాగింది.

ఆ రోజు సాయంత్రం కృష్ణమోహన్ యింట్లో లేనందుకు హరిప్రసాద్ కూడ రాలేదు...రాత్రి కృష్ణమోహన్ యింటికి వస్తూనే ఓ వార్తను అందజేశాడు.

వివరాలన్నీ చెప్తూవుంటే దిగ్భ్రాంతురాలై వినసాగింది సుపర్ణ.

'వాళ్లు ఎంత లక్షాధికారులైతేనేం. వాళ్లబ్బాయి మన్మథుడైతేనేం? మన సుపర్ణలాంటి అమ్మాయి వాళ్లకి దొరక వద్దా ఏమిటి? కళ్లకద్దుకొని మరీ చేసుకుంటారు. నిజం. మర్చిపోయాను. వాళ్లు వచ్చే సోమవారం మనింటికి వస్తారట. ఆ తర్వాతే జరగవలసిన మాటలు.' సుపర్ణను చూసి చిన్నగా నవ్వాడు కృష్ణమోహన్.

ఏం చెప్పాలో తోచలేదు సుపర్ణకు.

త్వరగా తినేసి తన గదిలోకి వెళ్ళి పడుకుంది. తెలియనిబాధ ఏదో గుండెల నావరించుకుంది. తను ఆ పెళ్లి చేసుకోలేదు. ఆ పెళ్లే కాదు మరింకేపెళ్లీ చేసుకోలేదు.

అస్పష్టంగా తన మనసులో కదులాడే హరిప్రసాద్ మూర్తిని తప్ప మరింకెవర్నీ

పెళ్లాడలేదు. కాని అన్నయ్యతో ఎలా చెప్పడం? చెప్తే కాదంటాడా? అయినా హరిప్రసాద్‌కేం తక్కువ? లక్షాధికారి కాకపోవచ్చు కాని తనను పువ్వుల్లో పెట్టి చూసుకునే తాహతు వుంది. యింకా ఏం కావాలి?...అన్నయ్య హరిప్రసాద్ కులాన్ని చూస్తాడా?...... డాక్టరు చదువు చదివి కులాలు, మతాలు వుత్త నాన్సెన్స్ అని మాట్లాడే అన్నయ్య కూడ కులం చూస్తాడా?...వుహు. అన్నయ్య నామాట వింటాడు. హరిప్రసాద్‌తో నా వివాహానికి అడ్డు పెట్టడు' రాత్రంతా ఏమేమో ఆలోచించి తెల్లారే సమయంలో కళ్లు మూసుకుంది సువర్ణ.

లేచేసరికి కృష్ణమోహన్ హాస్పిటల్ వెళ్లిపోయాడు.

సాయంత్రం అలవాటు ప్రకారం హరిప్రసాద్ యింటికివచ్చాడు. హరిప్రసాద్‌ను యింకా పరీక్షగా చూసింది సువర్ణ. ఆ సన్నటి కన్నుల్లో నిర్మలత్వమే వుందిగాని ఎక్కడా మలినఛాయలులేవు. కాస్త మోటు దేలిన పెదవులమీద పవిత్రమైన చిరుదరహాసమేవుందిగాని విషపుఛాయలులేవు. గుండె దిటవుచేసుకుంది సువర్ణ.

రాత్రి భోజనాలుచేసే సమయంలో మరీ చెప్పాడు కృష్ణమోహన్ పెళ్లి చూపుల గురించి. యిదే సమయమనుకుంది సువర్ణ.

మెల్లిగా అంది. 'నాకు ఆ పెళ్లి యిష్టం లేదన్నయ్యా'. అని.

'యిదేమిటమ్మా. చూడనైనా లేదే?' ఆశ్చర్యంగా అన్నాడు.

తలవంచుకుంది సువర్ణ.

'చెప్పమ్మా!' మృదువుగా అడిగాడు కృష్ణమోహన్.

'హరిప్రసాద్...'

కృష్ణమోహన్ చేతిలోని ముద్ద జారిపోయింది. ఒక్క క్షణం మౌనంగా వుండి అడిగాడు మెల్లిగా.

'వాణ్ణి చేసుకుంటావా?' చెప్పడంలో ఏదో అపశ్రుతి గోచరించింది సువర్ణకు

యింతదూరం వచ్చాక యిక దాచి ఏం ప్రయోజనం.

'అవునన్నయ్యా!' అంది.

'వాడికి యిన్నాళ్లవరకు పెళ్లెందుకు కాలేదో తెలుసా?'

'తెలుసు.'

'తెలిసికూడ...'

## గమనిక

ఉత్తరాల శీర్షికకి రాసేవారు ఈ కింది నియమాలు పాటించాలని మనవి: 1. ఉత్తరాలు వీలయినంత చిన్నవిగా ఉండాలి 2. రాసేవారి పూర్తిపేరు, చిరునామా ఇవ్వాలి 3. ఇంగ్లీషు లిపిలో అక్షరాలు రాయరాదు 4. కాగితానికి ఒకవయిపునవే రాయాలి. 5. సిరాతోనే రాయాలి. —సం॥



# నష్టజాతకుడు

'ఒక్కకులం తప్ప మనకు దేనిలో తక్కువ కానప్పుడు...'

'హుఁ. కులం. అది ఒక్కటే చాలదూ?'

'కులగోత్రాల్ని ద్వేషించేవాడివి నువ్వు కూడా...' ఆశ్చర్యంగా తలెత్తింది సువర్ణ.

'వాడికోసం నాకులాన్ని పాడుచేసుకోమంటావా? యీపెళ్లి ఎప్పటికీ జరగదు సువర్ణా! నువ్వు మర్చిపో' ఆజ్ఞాపించినట్లుగానే అన్నాడు కృష్ణమోహన్.

'క్షమించన్నయ్యా!' తలవంచుకునే అంది సువర్ణ.

చివ్వున తలెత్తాడు కృష్ణమోహన్.

'ఒక్క కులమేకాదు సువర్ణా! వాడు సగానికి సగం నా డబ్బుతోనే యింత చదివాడు. అది కూడ జ్ఞాపకం వుంచుకో. అల్లాంటివాడితో నా చెల్లాయి జీవితాన్ని ముడిపెట్టను.'

'నువ్వేమైనా చెప్పన్నయ్యా! నాకు ఆయన నచ్చారు'...ఆయన్నే చేసుకుంటాను.'

'సువర్ణా!' సహించనట్లు అరిచాడు కృష్ణమోహన్.

అంతలోనే తమాయించుకుంటూ అన్నాడు.

'నిజం సువర్ణా! హరిప్రసాద్‌ని ఎప్పుడూ నా స్నేహితుడి దృష్టితోనే చూశానుగాని నాకు కాబోయే 'బావ'గా. నా చెల్లాయి భర్తగా వూహించలేదు. వూహించను కూడ. నా చెల్లాయి జీవితం అల్లాంటి కులగోత్రాలు లేని అనాథతో ముడిపడటం యిష్టంలేదు. పెళ్లి అంటే యిష్టాయిష్టాలు కాదు సువర్ణా! నూరేళ్ల పంట. యవ్వనోద్రేకంలో మైమరచి యిచ్చిపుచ్చుకునే మాటలు జీవితాంతం వుండవు. బాగా ఆలోచించుకో సువర్ణా.' చెయ్యి కదుపుతూ అన్నాడు కృష్ణమోహన్.

మరునటిరోజు సాయంత్రం కృష్ణమోహన్ అడిగాడు.

'రేపు సోమవారం పెళ్లిచూపులకు వాళ్లు వస్తారు. నీకు యిష్టమేననుకుంటాను చెల్లాయ్!' అని.

ఓ క్షణం తటపటాయించి మెల్లిగా అంది సువర.

'క్షమించన్నయ్యా! నా అభిప్రాయం మారదు.'

కొద్ది క్షణాలు ఎవ్వరూ మాట్లాడలేదు.

సువర్ణ హరిప్రసాద్ విషయం చెప్పినప్పట్నుండి పద్మ బెదిరిపోయింది. హరిప్రసాద్ ఎంత కలిసిపోతున్నా తమ యింటి అల్లుడి స్థానాన్ని యివ్వలేదు. అలాగని కన్నకూతురి కంటే ఎక్కువగా ప్రేమించిన సువర్ణ యిల్లు విడిచి పోవడం కూడ యిష్టంలేదు. పొద్దుట్నుండి ఎన్ని పాఠాలు నేర్పినా సువర్ణ మరీ మొదటికి వచ్చేసరికి బాధపడింది పద్మ.

కృష్ణమోహన్ అన్నాడు.

'సరే. నీ యిష్టం. కాని ఒక్కమాట. నువ్వు యీ యింట గడప దిగిన తర్వాత యీ యింటి కూతురివి కాదు. నా చెల్లాయి...చనిపోయిందనే అనుకుంటాను.' గంభీరంగా అన్నాడు.

కళ్ల నిండుకు నీళ్లు వచ్చాయి సువర్ణకు.

'నీ చెల్లాయి ఎవరో ముష్టివాణ్ణి ప్రేమించలేదన్నయ్యా! సంఘంలో ఓ స్థానమున్న వ్యక్తినే ప్రేమించింది. హరిప్రసాద్ భార్యగా నా జీవితం నువ్వు వూహించినంత హాయిగానూ గడవగలదన్నయ్యా!'

'హుఁ. విన్ను బంగారులో పెట్టి పూజించినా వాడు అనాథే. నా డబ్బుతో పైకొచ్చిన వాడే. నా చెల్లాయి అల్లాంటివాణ్ణి ఏనాటికీ ప్రేమించదు.'

మరి వూహించనంతగా సువర్ణలో ఓ విధమైన రోషం పొంగింది.

* * *

కనుచీకటి వేళ హరిప్రసాద్ ఒంటరిగా యింట్లోనే వున్నాడు, ఆనాటి ఫైల్సు చూసుకుంటూ.

తలుపు చప్పుడయ్యేసరికి వెళ్లి తెరిచాడు.

ఎదురుగ్గా నీరసమైన మొహంతో నిల్చున్న సువర్ణను చూడగానే ఆశ్చర్యపడ్డాడు.

'మీరా! ఫోన్‌చేసివుంటే నేనేవచ్చివుండేవాడినికదా. కృష్ణ యింట్లోలేడా?' ఆశ్చర్యంగానే అడిగాడు.

యిన్నాళ్ల తమ పరిచయంలో ఎక్కువ హరిప్రసాదే కృష్ణమోహన్ యింటికి వెళ్లేవాడుగాని సువర్ణ, పద్మ హరిప్రసాద్ యింటికిరావడం చాలాతక్కువ. అల్లాంటిది

ఈరోజు సువర్ణ అలా వచ్చేసరికి ఆశ్చ ర్యంగావుంది హరిప్రసాద్‌కు.

గారిప్రసాద్‌ను తప్పించుకువచ్చి కుర్చీలో కూర్చుంది సువర్ణ.

'నేను మీ యింటికి వచ్చేశాను.' అంది.

'యిది చాల బావుందండి. మీరు చెప్పక పోయినా అది తెలుస్తూనేవుందిగా'నవ్వుతూ అన్నాడు హరిప్రసాద్.

'అలాకాదు. మీ యింట్లో శాశ్వతంగా వుండటానికి వచ్చేశాను.'

అయోమయంగా చూశాడు హరిప్రసాద్.

'మీరేం చెప్తున్నారో నాకు అర్థం కావడంలేదు. యింట్లో అలిగివచ్చారా?'

'లేదు.' అంటూనే తలవంచుకొని అంతా చెప్పింది చెప్పింది సువర్ణ.

చిన్నగా నిట్టూర్చాడు హరిప్రసాద్.

'నిజం. కృష్ణ చెప్పింది చాల నిజం సువర్ణా! కృష్ణనే లేకపోయివుంటే నేను ఈనాడు యీస్థితిలో వుండేవాణ్ణికాను. నేను మిత్రద్రోహిని, కృతఘ్నుణ్ణికాలేను' బాధగా అన్నాడు హరిప్రసాద్.

'అంటే?!...ఓస్త్రీ మిమ్మల్ని కోరి వస్తే మిత్రద్రోహిని అవుతాననే భయంతో వెళ్ళిపొమ్మని నిర్దాక్షిణ్యంగా చెప్పగలరా?' సూటిగా చూస్తూ మెల్లిగా అంది సువర్ణ. స్వరంలో ఎక్కడలేని బాధంతా వుంది.

'నిజమే. సువర్ణలాంటి కన్య తనకు తానై ప్రేమించాననివస్తే, అందులో స్త్రీ ప్రేమ అనేది ఎరుగని తన దగ్గరికి వస్తే ఎలా వద్దనగలడు? పైగా అంత కంటే అదృష్టం ఏముంటుంది తనలాంటి వాడికి.

మొట్టమొదటిసారి సువర్ణ సున్నిత మైన చేతిని తన చేతుల్లోకి తీసుకున్నాడు హరిప్రసాద్.

'ఈక్షణంనుంచి నువ్వు...నా దానవు సువర్ణా!' ప్రేమగా అన్నాడు.

స్త్రీకి ఎవరో ఒకరు తనని ప్రేమించే వాళ్ళు కావాలి' అలా లేకుండా ఓక్షణం కూడ జీవించలేదు. తల్లిదండ్రుల్లా ప్రేమిం చిన అన్నా వదినల్ని విడిచిపెట్టిన సువర్ణ హరిప్రసాద్ మనసు తెలుసుకునేంతవరకు నడిసంద్రాన నావలా వణికిపోయింది. హరి ప్రసాద్ ప్రేమతో 'నువ్వు నా దానవు సువర్ణా!' అనగానే అతని ఒళ్లోవాలి వెక్కివెక్కి ఏడ్చేసింది.

ఆరోజు రాత్రే ఆవూరిని విడిచిపెట్టే శారు. బొంబాయిలో స్థిరపడిపోయారు హరిప్రసాద్, సువర్ణలు.

* * *

మరుసటిరోజు వార్డ్ డాక్టర్ చెప్పిన మాటలు విని ఆశ్చర్యపోయింది సువర్ణ. 'అన్నయ్య...నేను ఈ కేసు తీసుకోను అని అంత ఖచ్చితంగా చెప్పిన అన్నయ్య...వారికి ఆపరేషన్‌చేస్తాడా?' అనుకొని.

ఎంతో సంతోషపడిపోయిన సువర్ణ మనసులో అప్రయత్నంగానే అనుమానం బయల్దేరింది.




'ఆయనమీద కోపంతో ఏమిచేస్తాడో! స్తానో.' వణికిపోయింది.

తెల్లటి బెడ్‌మీదపడుకున్న హరిప్రసాద్ మొహంవైపు చూసింది.

మొహంలో మునుపటి కళాకాంతులు లేకపోయినా పెదవులమీద తరగని ఆ చిరు నవ్వు నిర్మలంగా అల్లాగే వుంది.

* * *

కృష్ణమోహన్ హరిప్రసాద్‌ను, సువ ర్ణను మరీ కలుసుకోలేదు. ఆపరేషను థియేటరులో డాక్టరుగా ఓసారి హరిప్రసాద్‌ను పరీక్షించాడేగాని మరింకేమీ మాట్లాడలేదు.

మరుసటిరోజే హరిప్రసాద్‌కు కృష్ణ మోహన్‌చేసే మేజర్ ఆపరేషను.

* * *

హరిప్రసాద్‌ను ఆపరేషను థియేటరు లోకి తీసికెళుతూవుంటే ఒళ్లంతా కళ్ళు చేసుకొని చూసింది సువర్ణ.

కళ్లతోనే చిన్నగా నవ్వాడు హరి ప్రసాద్.

మంగళసూత్రాల్ని భక్తిగా కళ్ల కద్దు కుంది సువర్ణ.

ఓ అయిదు నిముషాల్లో తెల్లటి పొడ వైన కోటులో గంభీరంగా ఆపరేషను థియేటరు ముందుకువచ్చి నిలబడ్డాడు కృష్ణమోహన్.

ఓక్షణకాలం అలా నిలబడిన కృష్ణ మోహన్ను చూడగానే మనసులో ఎన్నెన్నో ఆశలురేగాయి. పరిగెత్తికెళ్ళి ఏమేమో చెప్పాలనుకుంది. అంతలోనే నిర్లక్ష్యంగా లోపలికి అడుగుపెట్టాడు కృష్ణమోహన్.

పాలపొంగుమీద నీళ్లు చల్లినట్ల య్యింది సువర్ణకు.

ఎంతో యిదిగా అణగద్రొక్కుకుం టున్న అనుమానాలన్నీ విషసర్పాల్లాగ చుట్టుకున్నాయి మరీ.

అక్కడున్న వారంతా తనవైపే జాలిగా చూస్తున్నట్లనిపించింది.

తన నుదుట అప్పటికప్పుడే కుంకుమ తుడుచుకుపోతుందేమో నన్నభావం మరీ పిచ్చిగా చేసేసింది.

క్షణక్షణానికి చూసుకుంటున్నా గడియారంలోని ముల్లు కదలనట్లే కన్పి స్తోంది. యింతలో ప్రక్కవార్డులోనుండి ఎవరో స్త్రీకెవ్వున ఏడ్చిన శబ్దం.

# నష్టజాతకుడు

ఫ్రీలిక్కివడి మోతగళమూత్రాల్ని తడుతు కుంది సుపర్ణ.

*　　　*　　　*

అపరేషను ధియేటరులోనుండి బయ టకు వచ్చిన కృష్ణమోహన్ చిన్నగా నిట్టూర్చి నుదుటపట్టిన చెమటను కర్చీపుతో తుడుచుకుంటూ నిలబడ్డాడు. దరిదాపుల్లో సుపర్ణ ఎక్కడా కన్పించలేదు.

చిన్నగా గొణుక్కున్నాడు 'చెల్లాయ్!' అని—

యింతలో నర్సువచ్చి ఓ కాగితం అందించింది.

'లోపలున్న పేషంటు మిసెస్ మీకి మ్మన్నారు సార్' అని.

ఆత్రుతగా విప్పాడు కృష్ణమోహన్.

'అన్నయ్యకు,

రెండేళ్ల క్రితం ఆయనకు కాన్సర్ అని తెలిసిన క్షణంనుంచే డాక్టర్లందరూ ఆయనమీద ఆశ వదిలేశారు. డాక్టర్లం దరూ ఆశ వదిలినా ప్రాణమున్నంత వరకు నా ఆశని చంపుకోలేను కదా. కన్పించిన ప్రతి డాక్టరుకూ చూపించాము. చివరికి బొంబాయిలోని డాక్టరు జగన్మోహన్ 'కాన్సర్ స్పెషలిస్టు ఒకరున్నారు. కన్సల్టు చెయ్యమని' నీపేరు చెప్పాడు. నీ దగ్గరికి వచ్చేదాకా నాకు ఆ డాక్టరు నువ్వేనని తెలి యదు. ముందే తెలిసివుంటే వచ్చేదాన్ని కానేమో? ఏమైతేనేం వచ్చాను. నువ్వు ఈ కేస్ తీసుకోనని చెప్పి, మళ్లీ నువ్వే తీసు కునేసరికి నా మనసు వద్దనుకున్నా కీడును శంకిస్తోంది. పైగా నువ్వన్న మాటలు యింకా బాగా జ్ఞాపకం వున్నాయి. నిజమే అన్నయ్యా! ఆయుష్షు వున్నవాడికి ఏం చెయ్యకపోయినా బ్రతుకుతాడు. లేనివాడికి ఏం చేసినా బ్రతకడు. అలాగని డాక్టరుకు చూపించకుండా వుంటామా? మానవ నైజం చాల విచిత్రమైంది. వేదాంతం మాట్లాడుతూనే సంసార తాపత్రయం కోసం గింజుకుంటాము. నా సంతృప్తి కోసం, ఆయన బ్రతుకుతారనే ఆశకొద్దీ నువ్వు ఆపరేషన్ చేస్తావంటే చాల సంతోషమైంది. కాని ఏదన్నా అయితే... నాకు నీమీద కలిగిన అనుమానాన్ని మర్చి పోలే నన్నయ్యా. జీవితాంతం మర్చిపోలేను. నా దురదృష్టానికి నువ్వే కారకుడవు అన్న విషయం మరువలేను. పైగా ఆయన లేకుండా జీవించనూ లేను. నా నుదుట కుంకుమ లేకుండా బ్రతకనూలేను. క్షమిం చన్నయ్యా!

మా యిద్దరికీ నువ్వు పెళ్లి చెయ్యక పోయినా కనీసం యిప్పటికైనా నీచెల్లాయి హృదయాన్ని అర్థం చేసుకున్నా వను కుంటాను.

సీ,

'సువర్ణ'

కాగితం మడిచి, కృష్ణమోహన్ బరు వుగా నిట్టూర్చాడు.

లోపలికెళ్లి హరిప్రసాద్ వైపు చూశాడు. మత్తుమందులో నిర్మలంగా నిద్రపోతున్నాడు హరిప్రసాద్. యింకొద్ది సేపట్లో లేవవచ్చు

'లేచి నా సువర్ణ ఏదని అడిగితే?'

విరక్తిగా నవ్వుకున్నాడు కృష్ణమోహన్.

'కాన్సర్ కోరల్లోనుండి బ్రతికి బయట పడ్డ నీ హరి అదృష్టవంతుడే చెల్లాయ్! ...కాని...కాని వాడు నష్టజాతకుడే.'

తను కొలకుల్లోనుండి రాలబోతున్న నీటిని కొనగోటితో తుడిచేసి, ధియేటరు బయ టికి వచ్చేశాడు కృష్ణమోహన్. ●

# ప్రొ॥ అల్లాడి రామకృష్ణన్



మద్రాసులో గణితశాస్త్ర పరిశోధనా సంస్థ డైరక్టర్ ప్రొ. అల్లాడి రామకృష్ణన్ గారు గణితశాస్త్రంలో అంతర్జాతీయ ఖ్యాతి కలవారు. వీరి ప్రచురణలు వందపైన వున్నాయి. వీటిలో అధికభాగం విదేశ పత్రి కల్లో ప్రచురితమయ్యాయి. వారి పరిశో ధనలు ఖగోళ భవుతికశాస్త్రం, కాస్మిక్ కిరణాలు క్షేత్ర సిద్ధాంతం, మూలకణాలు (ఎలిమెంటల్ పార్టికల్స్) మొదలైన రంగాల్లో సాగాయి. జూరిక్ యూనివర్సిటీకి చెందిన ప్రొ. డబ్ల్యు. హైట్లర్ ఆహ్వానంమీద ప్రొ. రామకృష్ణన్ కాస్మిక్ కిరణాల్నిగురించి గ్రంథం ఒకటి రాసారు. ఇది 1962లో పెర్గమన్ ప్రెస్ (లండన్) వారిచే ప్రచురిత మయ్యింది. 1968లో ఈ గ్రంథాన్ని రష్యన్ భాషలోకి అనువదించారు. వీరి గ్రంథం ఇంకొకటి అకడమిక్ ప్రెస్ (అమెరికా) వారిచే ప్రచురింప బడుతోంది. ప్రొ. రామ కృష్ణన్ గారివద్ద అనేక మంది విద్యార్థుల్ని శిక్షణ పొంది, డాక్టరేటు బిరుదులు సంపా యించారు. నిజానికి మన దేశంలో కేవలం గణితశాస్త్ర పరిశోధనలకోసం ఉద్దేశించబడిన సంస్థ మద్రాసు సంస్థ ఒక్కటే అని చెప్పవచ్చు.

ప్రొ. రామకృష్ణన్ వయస్సు సుమారు 50 సంవత్సరాలు. విద్యాభ్యాసం మద్రాసు యూని వర్సిటీలో జరిగింది. తర్వాత మాన్‌చెస్టర్ యూనివర్సిటీ(ఇంగ్లండ్)లో పి. హెచ్. డి. డిగ్రీ తీసుకున్నారు. కొంతకాలం మద్రాసు యూనివర్సిటీలో ప్రొఫెసర్‌గా పనిచేశారు.

ప్రొ. రామకృష్ణన్ మొత్తం 15 దేశాల్లో 67 విశ్వవిద్యాలయాల్లోనూ, ఇతర పరిశోధ నాసంస్థల్లోనూ విజిటింగ్ ప్రొఫెసర్‌గా పని చేశారు. పన్నెండు దేశాల్లో జరిగిన 20 అంతర్జాతీయ సమావేశాల్లోనూ, సదస్సుల్లోనూ పాల్గొన్నారు. వీరు యువ శాస్త్రజ్ఞుల్ని తరిఫీదు చెయ్యడంలో, వారిలో సృజనాత్మక శక్తిని, స్వతంత్రంగా ఆలోచించే శక్తిని పెంపొందించ డానికి నూతన పద్ధతుల్ని అనుసరిస్తున్నారు.

—డా॥ ఆర్. ఎల్. ఎన్. శాస్త్రి.

# నిరుత్సాహము బద్ధకమూనా?
# అజీర్ణమువల్ల కావచ్చు

మీ జీర్ణశక్తిపోతే మనస్సు సుస్థిరంగా ఉంచుకోలేరు. విసుగు చెరదుటో ఉంటారు? ఎడతెరిపిలేకుండా ఇంటి పనులన్నీ చక్కబెట్టుకోవలసిన ఇల్లాళ్లు అజీర్ణంవల్ల బాధపడలేరు. హ్యూలెట్స్ మిక్స్చర్ వాడండి. అమోఘంగా పనిచేస్తుంది. కడుపులో ఇది రక్షణపూతగా ఏర్పడుతుంది. బాధకలిగించే ఆమ్లరసములను సరిపరచి తిన్న ఆహారము జీర్ణించుటకు ఉపకరిస్తుంది.

హ్యూలెట్స్ మిక్స్చర్ చంటిపిల్లల జీర్ణాశయ రోగములకుకూడా మంచిది. విరేచనములకు నల్లమందు కలిపిన హ్యూలెట్స్ మిక్స్చర్‌ను వాడండి. హ్యూలెట్స్ మిక్స్చర్ జీర్ణశక్తికి ఉపకరించును.






C. J. హ్యూలెట్ & సన్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్
86/A నయనియప్ప నాయక్ స్ట్రీటు, మద్రాసు-3

HWT/CJH/130.7

## హ్యూలెట్స్ మిక్స్చర్ జీర్ణశక్తికి ఉపకరించును




**జ రి గి న క థ**

ముకుందం, సుందరం, ప్రకాశం, శకుంతల, శశి సుభద్రమ్మగారి సంతానం. పొలంమీద వచ్చే అదాయమూ, ముకుందం తెచ్చే కొద్దిపాటి జీతమూ వాళ్ళకి జీవనాధారం. విశ్వనాథంగారు ఆ కుటుంబానికి ఆప్తుడు. సుందరం తెలివైన వాడు. అతనికి మద్రాసువెళ్ళి 'బియ్యే' చదవాలని వుంటుంది. మొదట్లో కొంత వెనకాడినా ముకుందం అతని అభిలాషని తోసిపుచ్చలేక పోయాడు. సుందరాన్ని అందరూ కలిసి మద్రాసు పంపేస్తారు. చదువుమీద శ్రద్ధచూపని శకుంతల మనస్తత్వం గ్రహించి ఒక మంచి సంబంధంచూసి పెళ్లి చేసేస్తారు. సుందరం చదువు పూర్తి చేసుకుని వస్తాడు. ముకుందానికి పెళ్లి అవుతుంది. విశ్వనాథంగారు చనిపోవడంతో ఆయన కొడుకులు అప్పు తీర్చమని తొందరపెడతారు. సుందరానికి గొప్పింటి సంబంధం కలిసివస్తుంది. అతనికి రమణితో అట్టహాసంగా పెళ్లవుతుంది.

# 7

అలా మరో నాలుగురోజులు గడిచాయి—

ఆదివారం మధ్యాహ్నం అందరి భోజనాలూ అయి ఇంచుమించు పనులన్నీ అయిపోయాక, వీధిలో జట్కా ఆగిన చప్పుడయింది.

'బండాగినట్లుంది— మన గుమ్మంలోనే ఏమో చూడండ్రా' అంటున్న సుభద్రమ్మగారి మాటలు పూర్తికాకుండానే.

'అన్నయ్యా వాళ్ళూ వచ్చారమ్మా' అంటూ ఒక్క గొంతులో లోపలికివచ్చి ఆముక్క కాస్త చెప్పేసి మళ్లీ అంత హడావిడిగానూ వీధి గుమ్మంవేపు వెళ్లి పోయింది శశి.

ణయించినంత మట్టుకే రెండు మెతుకులు తిని బద్ధకంగా నడుంవాల్చిన యశోద పేపరు చదువు కుంటున్న ముకుందం గదిలోంచి ఇవతలకి వచ్చారు—

వాళ్ళు బండిదిగి లోపలికి వచ్చారు. సామానుతెచ్చి లోపలపెట్టి డబ్బు తీసుకు వెళ్లిపోయాడు జట్కాఅబ్బాయి—

పెళ్లిలో చూసినప్పటికంటె కాస్త బొద్దుగా మరీ పచ్చగా కొద్దిగా అలిసి పోయినట్లు కనిపిస్తున్న కోడలిని చూడగానే సుభద్రమ్మగారికి చటుక్కున ఏదో తోచింది. 'సరే— అడగటానికి టైమే రాదా ఏమిటి, ఇప్పుడే ఏమంత మించి పోయింది!' అనుకుంటూ మరేవో కుశల ప్రశ్నలువేస్తూ కూర్చుంది—

గదిలోంచి వస్తున్న శంకుతలని చూస్తూ 'సారీ చెల్లాయి, నీ కూతురి బాలసారె వేళ్టికి రాలేకపోయాం — అలాఅని బహుమతి ఎగగొట్టంలే' అన్నాడు సుందరం—

కాస్సేపు పలకరించుకోటాలూ అవీ అయాక 'ఉండండి— చన్నీళ్లు పోసుకో వద్దు—నీళ్ళపొయ్యి క్రింద కాస్త మంట వేస్తాను' అంది సుభద్రమ్మగారు స్నానాలకి లేవబోతున్న కొడుకూ కోడల్ని వుద్దేశించి. ఆ తరువాత, 'శశీ, కాస్త పొయ్యి అంటించి రామ్మా.' అంటూ చిన్నకూతురికి పురమాయించింది ఓమూల పైన ఎండ మండి పోతున్నా.

అప్పటికే యశోద కుంపటి అంటించి పాలు వెచ్చబెడుతోంది ఉదయం తీసి వుంచిన డికాషన్‌తో కాఫీకలిపి ఇవ్వటానికి —వాళ్ళు కాఫీలుతాగి స్నానాలు పూర్తి చేసుకువచ్చేసరికి సుభద్రమ్మగారు మళ్ళీ ఎలాగో వంట పూర్తిచేసింది కోడలి సాయంతో—

భోజనాలు అయింతరువాత తీరుబడిగా పెట్టె తెరచి అత్తగారికీ ఆడబిడ్డలకీ తోటికోడలికీ మద్రాసునుంచి తీసుకు వచ్చిన చీరలూ రవికలగుడ్డలూ పైకితీసి చాపమీద పరుస్తూ 'ఇందులో ఎవరికి నచ్చినవి వాళ్ళు తీసుకోండి.' అంది రమణి— శకుంతల కొడుక్కీ కూతురికీ ఖరీదైన దుస్తులు ఇచ్చింది— ఆ తరువాత ఖరీదైన పెన్నుతీసి ప్రకాశానికి ఇస్తూ, 'అప్పుడెప్పుడో అనుకున్నారుట మీ అన్నయ్య, నీకో కొత్త పెన్ను కొని యివ్వాలని—అది ఇన్నాళ్ళకి పండింది— తీసుకో.' అంది. అవన్నీ చూస్తున్న సుభద్రమ్మగారికి ఆశ్చర్యంతో క్షణం నోట మాటరాలేదు—ఖర్చు పెట్టటానికి కూడ అలవాటు వుండాలి—భాగ్యవంతుల ఇంట పుట్టి పెరిగిన రమణికి అన్ని పరదాలూ మర్యాదలూ తెలుసు. అనుకుని పొంగి పోయింది—అభిమానంగా కోడలి ముఖంవంక చూస్తున్న ఆవిడకి ఇంతకుముందు అడగాలనుకున్న విషయం గుర్తువచ్చింది—ఎలా అడగాలా అని ఆవిడ ఆలోచిస్తూండగా సుందరమే అన్నాడు చిన్నగా నవ్వుతూ, 'పెట్టెలోంచి ఇవన్నీ తీసిన దానివి మరి మీ అమ్మగారు మా అమ్మకి స్పెషల్‌గా వ్రాసిఇచ్చిన వుత్తరంకూడ తీసిఇయ్యి.' అని—

రమణి చెక్కిళ్ళు ఎర్రబడిపోయాయి— మొగ్గలా ముడుచుకుపోతూ, 'ఛ ఏమిటంత

మందిలో అలా అన్నారు.' అన్నట్లు చిరుకోపం తెచ్చుకుంటూ భర్తవంక చూడబోయింది.

'ఇంకా వుత్తరం ఎందుకూ—నేను గ్రహించుకున్నానులే' అంది సుభద్రమ్మగారు ఆప్యాయంగా కోడలి తల నిమురుతూ.

ఆ హడావిడిలో మెల్లిగాలేచి అవతలికి జారుకోబోయిన యశోద చెయ్యి పట్టుకుని దగ్గర కూర్చోపెట్టుకుంటూ శకుంతల రమణిని వుద్దేశించి.

'ఇదుగో, మీ అక్కయ్య సంగతి ఈపాటికి కనిపెట్టేసే వుంటావు—ఇవాళ మీరు వచ్చారని లేని ఓపిక తెచ్చుకుని సరదాగా ఈమాత్రం తిరుగుతోంది కాని అసలు ఈ వేవిళ్లతో చిక్కి సగమయిపోయింది పాపం...'

యశోదకి చచ్చేసిగ్గు ముంచుకువచ్చింది. 'ఛ-ఏమిటిబాబా ఈవిడకాస్తయినాసిగ్గు, సంకోచం లేకుండా ఇలా మాట్లాడేస్తుంది—వయస్సు చూస్తే నాకంటె కాస్త ఇటూ అటూగా వుంటుందేమో—అంతే—ఇద్దరు పిల్లలు పుట్టేసరికి పెద్ద ఆరిందాలా అన్నగార్ల ఎదురుగా కూడ జంకూ గొంకూ లేకుండా అన్నిఖబుర్లూ చెప్పేస్తుంది.' అనుకుంటూ, ఎవరి మొహం వంకా చూడలేక తల ప్రక్కకి తిప్పేసుకుని, 'మధ్యాహ్నం కాఫీకి కాసిని నీళ్లు కుంపటిమీద పడేసి వస్తాను.' అంటూ లేవబోయింది.

'కాఫీకి ఇప్పట్నుంచీ తొందరేమిటే—



ఫరవాలేదు. కాస్సేపు కూర్చో — మీ అడబడుచు హాస్యాలు నీకు కొత్త కాదుకదా.' అంది సుభద్రమ్మగారు.

'ఇదుగో, రోజూ అమ్మా నేను పోట్లాడుకుంటున్నాం — మనవడు కావా లంటుంది అమ్మ — కాదు కోడలు కావా లంటాను నేను — ఇప్పుడు ఒకరికిద్ద రయారు కనక ఒక్కరైనా నాకోరిక తీర్చాలి మరి — ఇప్పుడే చెప్పేస్తున్నా.' అని శకుంతల అంటూంటే.

'ఇద్దరూ కోడళ్లే అయితే ఏం చేస్తావు.' అన్నాడు ముకుందం.

'ఏ ముక్కా — కొంపతీసి ఇద్దర్నీ చేసుకుంటానంటాడా మీ అబ్బాయి.' అంది శశి.

'అబ్బే అంత అన్యాయంగా మాట్లాడను — ఇద్దరిలో పెద్దదాన్ని చేసుకుంటాను.' అంది శకుంతల.

సుభద్రమ్మ ముసిముసిగా నవ్వుకుంది వాళ్లమాటలు వింటూ. 'బాగనేవున్నాయి హాస్యాలూ, వాగ్దానాలూను — అక్కడికి అంతా నీ పెత్తనమే అయినట్లు,— తల్లిమాటలు వింటూ తగూకి సిద్ధపడ బోయింది శకుంతల. 'అది సరేకాని, ఇందాక మీ వదిన్ని ఓ సంగతి అడిగావు. గుర్తుందా — ఇలాంటివి తను ఎంత బాగా గ్రహించుకోగలదో ఒక్క సంఘటన చెప్తే తెలుస్తుంది మీకు.' అన్నాడు సుందరం

## ఆశలూ అనుభవాలూ

వెక్కిరింతగా భార్యవంక చూస్తూ.

'అహ — చెప్తాద్దు.' అన్నట్లు కళ్లతోనే వారించింది రమణి.

'ఏం ? ఫరవాలేదు చెప్పనీ.' అని, 'మద్రాసులో రమణికి ఓ స్నేహితురాలు దొరికింది — శ్యామల ఆవిడపేరు — ఆ మధ్య ఎప్పుడో ఆవిడ మా యింటికి వచ్చి తను మర్నాడు వూరికి వెళుతున్నానని చెప్పిందిట — ఇప్పుడెందుకూ, పండగలూ అవీ ఏం లేవుగా, లేకపోతే శలవుపెట్టి సరదాగా మీరిద్దరూ వెళ్లినస్తున్నారా — మళ్లీ ఎప్పుడు రావటం అని అడిగిందిట రమణి — వెళ్లటం ఇద్దరం కలిసే వెళ్తాం — నన్ను అక్కడ దించేసి ఆయన వెంటనే వచ్చేస్తారు — మా అమ్మకి పురిటిరోజులు అందుకు నేను రానటం కాస్త ఆలశ్యం అవుతుంది అందిట ఆ అమ్మాయి —

సరే ఆ తరువాత రెండు మూడునెలలు పోయాక ఆ శ్యామల మొగుడు కృష్ణమూర్తి మా యింటికి వచ్చి,

'ఏమండోయ్ మీ శ్యామలకి కొడుకు పుట్టాడు.' అన్నాడు సంబరంగా — 'ఓ — కంగ్రాచ్యులేషన్స్.' అని నేను అనే లోపునే ఈవిడ ఆశ్చర్యంగా కళ్లు విప్పార్చుకుని, 'అదేమిటే, — వాళ్లమ్మ పురిటికే వెళుతున్నానని చెప్పింది — అంది' అని సుందరం చెప్తూంటే అక్కడ కూర్చున్నవాళ్లంతా ఒక్కసారే కిసుక్కున నవ్వేశారు.

'ఆ — మరి — అప్పుడత నేమన్నాడన్నయ్యా,' అంది శకుంతల ఆ దృశ్యాన్ని వూహించుకుని పడీపడీ నవ్వుతూ — రమణి కూడ వాళ్లతోపాటు సరదాగా నవ్వేసింది.

'ఏమంటాడు — మా అత్తగారికి కూతురు పుట్టిందిలెండి — అయినా మీ స్నేహితురాలి సంగతి మీకు తెలయలేదా అన్నాడు అంతకన్నా రెట్టింపు ఆశ్చర్యంతో నోరు తెరుస్తూ...'

'ఆ — ఆ అమ్మాయి బాగా ఒడ్డూ పొడుగ్గా వుంటుంది — మరి కాస్త ఒళ్లు పట్టిందేమో అనుకున్నానే కాని నాకేం తెలియలేదు.' అంది రమణి అమాయికంగా.

'బాగుంది.' అంది సుభద్రమ్మగారు తలుచుకు తలుచుకు నవ్వుకుంటూ.

'నీ శలవ ఎప్పటిదాకా వుంది.' కాస్సేపటి తరువాత అన్నాడు ముకుందం సంభాషణ మరోవేపుకి మళ్లిస్తూ.

'ఎల్లుండో ఎల్లుండి, రేపు ఎల్లుండికి ఆఫీసులో చేరాలి...'

'అదేమిటి — పెట్టుమని పదిరోజులయినా వుండకుండా వెళ్లిపోతావా — పోనీ శలవ పొడిగించరాదా.' ఆశగా చిన్నకొడుకు మొహంలోకి చూసింది సుభద్రమ్మగారు.

'ఇప్పుడు వీలుకాదమ్మా — ఓ ఫారిన్ స్కాలర్‌షిప్‌కి ప్రయత్నం చేస్తున్నాము — మద్రాసు వెళ్లి ఆ వ్యవహారాలేవో చూసుకోవాలి...'

'ఫారిన్ వెళుతున్నావా —' ఇంచుమించు అంతా ఒక్కసారే సంతోషంగా అడిగారు.

'ప్రయత్నాలు చేస్తున్నాను — ఇంకా నిశ్చయంగా తేలలేదు.' అన్నాడు సుందరం నసిగేస్తున్నట్లు.

'మీకు అన్నింటికీ అనుమానమే — మా అన్నయ్య సంగతి మీకింకా బాగా తెలియదు — తను తలుచుకున్నాడంటే ఆ పని పూర్తయిందాకా మరి నిద్రకూడ పోడు — ఒకవేళ ఆ రమేష్‌ద్వారా పని సానుకూలం కాకపోతే మరో మహేష్ నెవరినైనా పట్టుకుంటాడు కాని ఆ ప్రయత్నాన్ని అలా మధ్యలోనే విరమించుకోడు — ఓ కొద్దిరోజులు అటూ ఇటూ అవుతుందేమో కాని, మీరు వెళ్లటంమాత్రం ఖాయం.'



అంది రమణి వుల్లాసంగా కళ్ళు తిప్పుతూ.

'ఆ రమేష్ వీళ్ళన్నయ్య స్నేహితుడు— చిన్నప్పుడు వీళ్ళింట్లో నేవుంచి చదువుకుని పైకి వచ్చాడు—ఆ అభిమానం అతనికి బాగా వుంది — అసలు ఈ స్కాలర్‌షిప్ విషయం అదీ సజెస్టు చేసింది అతనే — అనుకోకుండా అవకాశం వస్తుంటే నాకూ వదులుకోబుద్ధి కావటం లేదు— ఉద్యోగం గురించి ఏమీ ఆలోచించకు— ఇప్పుడిది రిజైన్ చేసేయి—తిరిగి వచ్చాక ఇంతకన్న పెద్ద స్కేలుమీద జాబ్ ఇప్పించే పూచీ నాది అంటున్నారు వీళ్ళ బాబాయి.' ఎవ్వరూ అడగకపోయినా తనకై తనే అన్ని విషయాలూ చెప్పాడు సుందరం ఏమిటో ఇబ్బందిగా ఎటో చూస్తూ.

'మీరా జాబ్ విషయంమాత్రం మరిచిపోయేలా లేరు — ఫారిన్ డిగ్రీతో వచ్చిన మీకు ఈ కంపెనీ అన్న మాటేమిటి ఎవ్వరైనాసరే కళ్ళకద్దుకుని మరీ ఇస్తారు వుద్యోగం' అంది రమణి దర్పంగా కళ్ళూ తలా తిప్పుతూ.

పెళ్ళయి ఏడెనిమిది నెలలు అయిందేమో — అంతే — ప్రక్కని అత్తగారూ బావగారు అంతా వున్నారనే మొహమాటం అయినా లేకుండా రమణి అలా మొగుడితో మాట్లాడేస్తుంటే సుభద్రమ్మగారికేమిటో కాస్త ఎబ్బెట్టుగా అనిపించింది—ఆ అసంతుష్టి ఆవిడ కళ్ళూ మొహం కాస్త చిట్లించుకోటంలో వ్యక్తం చేసేసుకుంది కాని అది ఎవరికంటా మాత్రం పడలేదు.

'చేతిలో వున్న వుద్యోగంకూడ వదులుకొని వెడతాడన్న మాట—సరే—ఆ మంచి చెడ్డలన్నీ వాడికి తెలియవా... అయినా భార్యా బావ మరిది వాళ్ళంతా ప్రోత్సహించి పంపిస్తుంటే అర్థంలేని అనుమానాలు నేను వెలిబుచ్చటం ఏమిటి' అనుకొని, నోటి చివరిదాకా వచ్చిన మాటకూడ అడగటం మానేశాడు ముకుందం.

'ఇంతకీ అసలు ఎప్పుడు బయలుదేరాలేమిటి' అంది సుభద్రమ్మగారు వూరుకోలేక.

'తెలియదమ్మా — అన్నీ నిశ్చయం అయాక వ్రాస్తాను' అన్నాడు సుందరం.

కాస్సేపు వాతావరణం నిశ్శబ్దంగా మారిపోయింది. ఎవరి మట్టుకి వారే మాట్లాడటానికి మరేమీ లేదన్నట్టు ఎటోచూస్తూ కూర్చున్నారు.

'ఫారిన్‌వెళ్ళి చదువుకోటం అంటే మాటలుకాదు—ఈ వూరి మొత్తానికి ఏ ఒకరిద్దరో వున్నారేమో అలాంటి చదువు చదివి వచ్చినవాళ్ళు—తమ ఇంట్లో వ్యక్తికి అలాంటి అవకాశం, అదృష్టం రాబోతోంది అంటే అందరికీ ఎంతో సంతోషంగానూ వుంది— ఇదీ అని చెప్పలేని మరో భావంకూడ అందరి మనస్సులనీ కొద్ది క్షణాలు కప్పుకుపోయింది— అందుకే ఆ మౌనం.

ఆ తరువాత ఆ సంభాషణ మరేవో విషయాలమీద జరిగింది కాస్సేపు.

నాలుగురోజులు గడిచిపోయాయి— మర్నాడే సుందరం భార్య మద్రాసు వెళ్ళిపోయేది.

సుందరానికి ఇష్టం అని పెసరపప్పు పూర్ణ బబ్బట్లు చెయ్యాలని తలపెట్టింది సుభద్రమ్మగారు అవాళ— వంట పిండివంటా రెండూ చూసుకుంటోన్న ఆవిడ దగ్గరికి 'అమ్మా' అంటూ గాలివానలా హడావిడిగావచ్చి పడ్డాడు ప్రకాశం చేతిలో పేపరుతో.

## ఆశలూ — అనుభవాలూ

'ఫస్టు క్లాసులో ప్యాసయిన కళ వుందిరా నీ మొహం చూస్తుంటే' అంది ఆవిడ చేస్తున్న పని ఆపి తల ఎత్తి ఆపేక్షగా చూస్తూ.

'జానమ్మా పెద్దన్నయ్యకీకూడ చెప్పేసి వస్తాను'—అంటూంటే అటుగా వచ్చిన యశోద అంది, 'ఏమిటి ప్రకాశం — మీ పరీక్షలు తెలిశాయా...'

'జానాదినా — హడావిడిలో నీకు చెప్పటం మరిచిపోయాను— చిన్న వదినకీ అక్కయ్యకీ కూడ చెప్పేసి వెళ్తాను.'

'నువ్విప్పుడు కాళ్లీడ్చుకుంటూ మీ అన్నయ్య దగ్గిరికి వెళ్లకపోతేనేం— ఓ అరగంటలో తను భోజనానికి వస్తా నన్నారు.'

'భలేదానివే — అరగంటదాకా యిలా కూర్చోమంటావా — అయిదు నిమిషాలలో ఈ శుభవార్త అన్నయ్య చెవిని వేయకపోతే నాకెలా వుంటుందో నీకు తెలియదు'

'పోనీ వెళ్లిరా—' అంది సుభద్రమ్మగారు.

అతను నాలుగడుగులు వెయ్యకుండానే వీధి వరండాలో ఇద్దరు అన్నగార్ల మాటలూ వినిపించాయి — స్నేహితులని కలుసుకు వస్తానని బయలుదేరిన సుందరం అటునుంచి ముకుందం ఆఫీసుకి వెళ్తాడు. ఇద్దరూ కలిసి ఇంటికి వస్తూంటే దార్లోనే ప్రకాశం స్నేహితుడొకడు కనిపించి ఆ శుభవార్త వాళ్లకి చెప్పేశాడు.

తన సంతోషాన్ని మాటలతో వ్యక్తం చెయ్యటం చేతకాని వాడిలా అభిమానంగా తమ్ముడి భుజాలచుట్టూ చెయ్యివేసి అక్కున జేర్చుకున్నాడు ముకుందం ఇంటికి వస్తూనే.

'కంగ్రాచ్యులేషన్సు — మరి నీకేం ప్రెజెంటేషను కావాలిరా' అన్నాడు సుందరం.

'నువ్వు రాగానే పెన్ను ఇచ్చేశావుగా— మరింకేమీ అక్కర్లేదు.'

'అది వేరు—ఇప్పుడు పరీక్ష ప్యాసయిన ప్రెజెంటేషను వేరు.' అంది అప్పుడే స్నానం అదీ ముగించుకు వచ్చిన రమణి. 'అడగరా' అంది శకుంతల—

ప్రకాశం మాట్లాడలేదు—సుందరం జేబులోంచి పది రూపాయల నోటుతీసి తమ్ముడిచేతిలో పెడుతూ 'మీ ఫ్రెండ్సుని తీసుకొని ఏ సినిమాకో హోటలుకో వెళ్లు' అన్నాడు.

'స్నేహితులతో అక్కర్లేదు కాని, సినిమాకి మనందరం కలిసివెళ్దాం—నీదగ్గరే వుంచు' అన్నాడు ప్రకాశం.

'వాడు సంతోషంగా ఇస్తూంటే వద్దంటావేమిటి—అదిపెట్టి నువ్వే అందర్నీ తీసుకెళ్దువుగాని—' అన్నాడు ముకుందం —యశోద నవ్వుతూ అంది.

'మీ తమ్ముడి గడుసుదనం నాకర్థమయింది లెండి—మనల్నందర్నీ తీసుకెడితే అది చాలదేమో, తన చేతిది వేసుకోటం ఎందుకు, ఏదేదో అన్నగారిచేతే వదల్చాలని.'

'వాడేం వుద్యోగం చేస్తున్నాడేమిటి దగ్గర డబ్బు వుండటానికి — తీరా హాలు దగ్గిరికివెళ్లి డబ్బు చాలలేదు అనేకంటే ముందే జాగ్రత్తపడ్డాడు — తప్పేమిటి.' అంది శశి అన్నగారిని వెనకేసుకు వస్తూ.

కాస్సేపు సరదాగా కబుర్లతోటి కాలక్షేపంచేసి భోజనాలకి లేచారు — మళ్లీ ఒకసారి షాపుకివెళ్లి త్వరగా వచ్చేశాడు ముకుందం—అందరి బలవంతంమీద సుభద్రమ్మగారుకూడ ప్రయాణం అయింది సినిమాకి — రాత్రిపన్నెండు కాస్సేపు నడుం వాల్చిందో లేదో మళ్లీ చీకటితో లేచి స్నానం అదీచేసి వంటపనిలో జొరబడిపోయింది హడావిడిగా—

భోజనాలుచేసి డ్యూటీకి వెళ్లిపోయారు సుందరం, రమణి.

ఆ సాయంకాలం—ప్రకాశం ఎక్కడికో వెళ్లాడు. శశి అవతలిగదిలో ఏదో పుస్తకం చదువుకుంటోంది—యశోద వంటగదిలో వుంది—శకుంతల మరేదో పనిలో వుంది— ఆరుబయట మంచం వాల్చుకుని ఒంటరిగా కూర్చున్న తల్లిదగ్గిరికి వెళ్లాడు ముకుందం.

'ఇవాళ కాస్త త్వరగా రావటానికి వీలయిందేమిటి? కాఫీ తాగావా.?'

'ఇవాళ పని ఎక్కువలేదు—చెప్పి వచ్చేశాను...కాఫీ కలుపుతోంది — ' అంటూ మరో మంచం వాల్చుకున్నాడు.

యశోద గ్లాసుతో కాఫీ తెచ్చి భర్తకి

అందించి వెళ్ళిపోయింది—

ఏదో మాట్లాడుకోవాలనీ అందుకు ఇదే అనువైన సమయం అనీ ఆ తల్లీకొడుకుల కిద్దరికీ అనిపిస్తోంది—కాని ఎలా మొదలు పెట్టాలా అన్నట్లు ఎవరికివారే వూరు కున్నారు—గ్లాసు ఖాళీచేసి క్రిందపెట్టేసి తనమంచం మరి కాస్త దగ్గరగా జరుపు కుని కూర్చుంటూ, 'అయితే ప్రకాశాన్ని ఏం చదివించటం' అన్నాడు ముకుందం చివరికి.

'ఈ వూళ్ళో వున్నదేదో చదువుకుంటాడు—మరేం చేస్తాం— అయినా అసలు ఏదో అనుకున్నామే కాని వాడు నన్నువిడిచి రెండురోజులుకూడ వుండలేడు — అంత దూరంలో అన్నేళ్ళువుండి ఏం' చదువుతాడు.' అంది సుభద్రమ్మగారు తన మనసులో నిరాశ పైకి వ్యక్తం కానివ్వకుండా.

ముకుందం ఏం మాట్లాడలేదు. 'ప్రకాశాన్ని డాక్టరు చదివిద్దాం— అయినా ఆ భారం మనమీదేమి వుండదులే. సుందరం దగ్గరపెట్టుకు చదివిస్తాడు. ఆనాడు కష్టమో నిష్ఠూరమో భరించి నువ్వు వాడికి పెద్దచదువు చెప్పించావు. అది ఈ నాడు ఇలా అక్కరకు వస్తుంది.' అంటూ విన్నాళ్ళనుండో మురిసిపోతున్న తల్లి ఇవాళ ఇలా అంటూంటే జాలిగా ఆవిడ కళ్ళల్లోకి చూస్తూ ఒక్క నిట్టూర్పు విడవటం తప్ప మరేం చేయాలో తోచలేదతనికి.

ఒక్కనిముషం తరువాత ఆవిడే మళ్ళీ అంది— 'వాడేం పసివాడు కాదు. మన యింటి వ్యవహారాలేమీ తెలియనివాడు అంతకన్నా కాదు—అన్నీ తెలిసికూడ ఇంకా నేను చదువుకుంటాను ఇంగ్లండు వెడతాను అమెరికా వెడతాను అని ఎగురుతూంటే, ఒరే నీ చదువుసంగతి తరువాత చూద్దాం ముందు తమ్ముడిని దగ్గర పెట్టుకు చదివించు అని ఎలాచెప్పటం...'

'ఆమాట నిజమేలే, ఐనా ఇప్పుడీ అవకాశం వదులుకుంటే మళ్ళీ మళ్ళీ అలాంటి ఛాన్సు వస్తుందో రాదో చెప్పలేం—వాడికి చదువులో అఖండమైన తెలివితేటలున్నాయి. అంతులేని తృష్ణ వుంది—దానికి తగినట్లుగానే భార్యా బావమరిది ఎంతో ప్రోత్సహిస్తూ ఆ ఏర్పాట్లన్నీ చేస్తున్నారు—మనంతట మనం పంపించి

ఆ చదువు చెప్పించటం ఈ జన్మలో సాధ్యంకాదు—మరి అలాంటప్పుడు అమ్మ పెట్టా పెట్టదు—అని శాస్త్రం చెప్పినట్లు ఆ ప్రయత్నాలికికూడ అడ్డు తగలటం బాగుండదు కదా...'

'అది వాడికితోచాలి అంతే—ఆమాట కొస్తే నీ కుమాత్రం తెలివితేటలు లేవూ, చదువుకోవాలనే సరదా లేదూ—ఆయనెవరో వూరికే చెప్తాను అన్నాడుకూడ, నేనూ చెప్పాను చదువుకోమని అయినా నువ్వు...'

'అప్పటి పరిస్థితులు వేరులే—అయినా నా ఆలోచనలు నావరకేకాని అందర్నీ అలా చెయ్యమటనం భావ్యంకాదు—' అంటూ మధ్య లోనే తల్లిమాటలని త్రుంచేశాడు ముకుందం. 'తమ్ముడు ఫారిన్‌వెళ్లి పెద్దచదువు చదువుకు వచ్చాడంటే మన కుటుంబాని కంతకీ గర్వకారణమే కదమ్మా—రెండు మూడేళ్లు ఎంతలో తిరిగివస్తాయి—అటు నుంచి వచ్చాక ఇంకా పెద్ద వుద్యోగం వస్తుంది వాడికి...'

'ఎంతొస్తే మాత్రం ఏం లాభంలే—మద్రాసులో పెద్ద వుద్యోగం వచ్చిందని పొంగిపోయాం— ఓ ఏడెనిమిది నెలలపాటు ఇంటికేదో పంపించాడు—ఆ తరువాత పెళ్లి, కొత్తకాపురం, బోలెడు ఖర్చులు అంటూ—'

'అనటం ఏమిటిలే—అసలు పరిస్థితే అలా వుందేమో— ఇంతజీతం వస్తోంది అనుకోటమే కాని అలాంటి మహా పట్నా లలో దానికి తగిన ఖర్చులూ వుంటాయి.' తమ్ముడి పరిస్థితిని అర్థం చేసుకోటానికి ప్రయత్నించాడు ముకుందం.

'అందులోనూ ఆ అమ్మాయికి కాస్త పొదుపుగా సంసారం చేసుకోటం అదీ ఏం తెలిసినట్లుకూడ లేదు—అయినదానికీ కాని దానికీ వూఁదుబారా చెయ్యడమే కాకుండా ఆడంబరాలకీ దర్జాలకీ డబ్బు పాడు చేస్తుందను కుంటాను—' అంది; చిన్న కోడలిది భారీచెయ్యి—దర్జాగా ఖర్చుపెట్ట టానికన్నాడ అలవాటువుండాలి అనుకుంటూ ఒక్క వారంరోజుల క్రిందటే తెగ మురిసి పోయిన సంగతి ఆవిడకి కాస్తకూడ గుర్తు లేదు.

'కాస్త కలిగిన కుటుంబంలో మంచి వచ్చింది — చేతినిండా ఖర్చు పెట్టుకునే అలవాటు వుంటుంది—ఇవాళ నా సంపాదన గీసిగీసి ఖర్చుపెట్టి మిగిలింది మావాళ్లకి పంపిద్దాం అని చెప్పటానికి వాడూ మొహమ్మాటు పడుతున్నాడేమో...'

'వాడు చెప్పలేదు, ఆపిల్ల అర్థం చేసుకోదు—ఇంక ఆ సంసారం అలా జర గాల్సిందే— ఇంకా పెద్దచదువు చదివి మరింత జీతం తెచ్చుకుంటేమాత్రం ఇంతకన్న మనల్ని పోషిస్తాడని నాకేం నమ్మకం కలగటంలేదు...'

'పోనిద్దూ—వాళ్లుసుఖంగా వుండటం కన్న మనకి కావలసిందేమిటి—మరోవిషయం. ఏదో వాడు ఎక్కడికో వెళ్లిపోతున్నాడని నిష్ఠూరం వేస్తున్నామేకాని ఇక్కడ వుంటే మాత్రం ప్రకాశాన్ని చదివించగలడనే నమ్మకం ఏమిటి—అసలే డబ్బు చాలటం లేదు అనుకుంటున్న వాడికి బాధ్యతలూ ఖర్చులూకూడ పెరుగుతున్నాయి...'

'నిజమేలే—'

'నా కిప్పుడు ఒక్కటే బాధగా వుంది—ఇన్నాళ్లూ మనం గాలిమేడలు కట్టుకుని ప్రకాశానికి కూడ లేనిపోని ఆశలు కల్పించాం—ఈ నిరాశకి వాడు ఎలా తట్టుకుంటాడో అనిపిస్తోంది — పోనీ, అయితే అవుతుందని మనమే హాస్టల్లో వుంచి చదివిస్తే...?'

'ముకుందం — నీకు మతేమయినా పోయిందా?' విస్మయంగా, మందలింపుగా కొడుకువంక చూసింది.

...అందరం ఇలాంటి ఇబ్బంది (బతు కులు (బతికే బదులు కొంతమందైనా పైకి వస్తే బాగుంటుంది కదమ్మా—'

'నాకేం నచ్చలేదు నువ్వు చెప్పింది.' నిష్కర్షగా చెప్పేసింది ఆవిడ.

ఇంతలో ప్రకాశం లోపలికి వస్తూ కనిపించాడు.

'ఇలారా!' అంటూ అతన్ని దగ్గరికి పిలిచాడు ముకుందం.

'నీ చదువుమాట ఏం చేద్దామని వుంది,' అంది తల్లి.

'నేను అనుకుంటున్నాను...' అంటూ మొదలుపెట్టి తన మనస్సులో మాట బైటపెట్టాడు ముకుందం.

ఏదో ఆలోచిస్తున్న వాడిలా తల వంచుకుని కొద్దిక్షణాలు మౌనంగా వుండి పోయాడు ప్రకాశం. తరువాత మెల్లిగా అన్నాడు. 'నేను బియ్యేస్సీలో చేరతాను—నిజంగానే నాకేం బాధగా లేదు—అన్నీ మనం అనుకున్నట్లు జరగవు కదా — అదృష్టం బాగుంటె ఆతరువాత ఎమ్మెస్సీకి వెళ్తాను.'

సుభద్రమ్మగారు ముకుందం మొహాలు చూసుకుని ఒక్కసారి దీర్ఘంగా నిట్టూర్చారు.

చివరికి అతని చదువు విషయం ఒక నిర్ణయం జరిగిపోయింది—

కాస్సేపటి తరువాత కొడుకులిద్దరూ భోజనానికి వెళ్లారు— ఆవిడ మంచంమీద పడుకుని ఆలోచిస్తూంటే ఏమిటో అనేకమైన భయాలు రేగుతున్నాయి మనస్సులో—'ప్రకాశాన్ని దగ్గర పెట్టుకు చదివిస్తాడు అన్న ఆశ నిరాశ కావటం సరే—వీడు ఆ ఫారిన్ ఏదో వెళ్లి తిన్నగా వస్తాడా—ఆ రాజమ్మగారి మరిది ఇలాగే వెళ్లాడు — రెండేళ్లకి వస్తానన్నవాడు అయిదేళ్లకి తిరిగి వచ్చాడు. అదయినా వీళ్లు వుత్తరాలమీద వుత్తరాలు గుప్పించి బతిమాలుకుంటే వచ్చాడు — ఈలోగా వేలకివేలు డబ్బు ఖర్చయింది— ఇంతా చేసి వచ్చినవాడు ఆ డిగ్రీ మాట దేవుడెరుగును కాని ఓ దొరసాన్ని వెంటపెట్టుకుని మరీ వచ్చాడు — అప్పటికే ఇక్కడ భార్యా ఓ పిల్లవాడు వున్నారు — నానా రభసా అయింది—ఇక్కడ కట్టుకున్న పెళ్లాన్ని వదిలేస్తాననే క్కూర్చున్నాడు కొన్నాళ్లు—చివరికి ఇద్దరినీ పెట్టుకుని బొంబాయిలోనో ఎక్కడో వుంటున్నాడనుకుంటా — వీడు ఏం చేస్తాడో—నా బిడ్డ పై దేశాలు వెళ్లి పెద్దచదువులు చదివాడని చెప్పుకోటం బాగానే వుంటుంది— మరి వాడు ఎలాంటి అప్రతిష్ఠపనీ చెయ్యకుండా రావాలికదా — ఏమిటో అంతా అయోమయంగా వుంది.' అనుకుంది.

(ఇంకావుంది)

| గెలవండి |
|---|
| రు. 2000 |

# విజయ సాహితి - 8.

(భారత సుప్రీంకోర్టు తీర్పు ననుసరించి, నిర్వహింపబడుచున్న ప్రథమ తెలుగు సాహిత్య పోటి)

| ఆఖరు తేది |
|---|
| 10-10-69 |

## 12. ఆధారములు

1. లడది ఆడదాన్ని/మగవాణ్ణి అర్థం చేసుకున్నట్లు మగవాడు స్త్రీని ఎప్పటికీ అర్థం చేసుకోలేడు.
2. ఎదురుచూచే ఆశలుంటే, ఆ ఆశలను తీర్చుకోవాలనే ఆరాటం/పట్టుదల వుంటే బ్రతుకు తియ్యగా వుంటుంది
3. మానవుడికి విచారం గాని, ఆనందం గాని పెల్లుబికినప్పుడు ఏకాంతం/తోడు అన్వేషిస్తాడు.
4. స్త్రీ ఎప్పు డెప్పుడు, ఎందు కెందుకు, ఎలా ఎలా ఏడుస్తుందో/నవ్వుతుందో ఎవరు చెప్పగలరు !
5. ఆత్మతేజమును వికసింపజేయుటకు ఓర్పు/శరీరం ఒక సాధనం అంటాడు ఆదర్శసాధనా నిమగ్నుడు.
6. భగవంతుని మీద ఉన్న ప్రేమ నిజమైనది. మానవులపై వుండే ప్రేమ కలుష/సహజ మైనది.
7. కళ/జీవితం లో యదార్థాన్ని తెలుసుకోటమే నిజమైన కళా స్వాదన.
8. కళ/ప్రేమ అంటే యేమిటో కళంకంలేని మనసు గలవానికే బోధపడుతుంది.
9. ప్రాణికి ప్రాణి సన్నిహితం కావటం కష్టం/సేవ లోనే కాబోలు !
10. పెళ్ళి కాని విచారం కంటె, పెళ్ళి కాదేమో నన్న భయం/విచారం ఆడపిల్లల్ని ఎక్కువ కాలుస్తుంది.
11. జీవితంలో పెళ్ళి ముఖ్యమైనదే కావచ్చు. దానికి తోడుగా/మించిన మరికొన్ని బాధ్యతలు కూడా వుంటాయి.
12. స్త్రీకి జీవితంలో వివాహం అనేది పెద్ద మలుపు/సమస్య.

| | 1 | | 2 | | 3 | | 4 | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | ఆడదాన్ని | మగవాణ్ణి | ఆడదాన్ని | మగవాణ్ణి | ఆడదాన్ని | మగవాణ్ణి | ఆడదాన్ని | మగవాణ్ణి |
| 2 | ఆరాటం | పట్టుదల | ఆరాటం | పట్టుదల | ఆరాటం | పట్టుదల | ఆరాటం | పట్టుదల |
| 3 | ఏకాంతం | తోడు | ఏకాంతం | తోడు | ఏకాంతం | తోడు | ఏకాంతం | తోడు |
| 4 | ఏడుస్తుందో | నవ్వుతుందో | ఏడుస్తుందో | నవ్వుతుందో | ఏడుస్తుందో | నవ్వుతుందో | ఏడుస్తుందో | నవ్వుతుందో |
| 5 | ఓర్పు | శరీరం | ఓర్పు | శరీరం | ఓర్పు | శరీరం | ఓర్పు | శరీరం |
| 6 | కలుష | సహజ | కలుష | సహజ | కలుష | సహజ | కలుష | సహజ |
| 7 | కళ | జీవితం | కళ | జీవితం | కళ | జీవితం | కళ | జీవితం |
| 8 | కళ | ప్రేమ | కళ | ప్రేమ | కళ | ప్రేమ | కళ | ప్రేమ |
| 9 | కష్టం | సేవ | కష్టం | సేవ | సష్టం | సేవ | కష్టం | సేవ |
| 10 | భయం | విచారం | భయం | విచారం | భయం | విచారం | భయం | విచారం |
| 11 | తోడుగా | మించిన | తోడుగా | మించిన | తోడుగా | మించిన | తోడుగా | మించిన |
| 12 | మలుపు | సమస్య | మలుపు | సమస్య | మలుపు | సమస్య | మలుపు | సమస్య |

ప్రతి రెండు కూపనులకు 1 లఘు సాహితి ఉచితం.

| | 1 | లఘు సాహితి | 2 | |
|---|---|---|---|---|
| 1 | ఆడదాన్ని | మగవాణ్ణి | | |
| 2 | ఆరాటం | పట్టుదల | | |
| 3 | ఏకాంతం | తోడు | | |
| 4 | ఏడుస్తుందో | నవ్వుతుందో | | |
| 5 | ఓర్పు | శరీరం | | |

నిబంధనలకు బద్ధుడనై నా ఎంట్రీలకుగాను రూ. ..................
ఎం. ఓ./ఐ.పి.ఓ. ద్వారా పంపి రసీదు జతపరచుచున్నాను.
M.O./I.P.O. నెం. ..................

పేరు ..................................................

అడ్రసు: ..................................................

..................................................

గమనికలు :— 1. ఆధారముల సహాయంతో మీరు తప్పు అనుకొనే పదం కొట్టివేయండి. (2) ఎంట్రీ 1కి 1 రూ॥ చొప్పున M.O./I.P.O. (క్రాసుచేయని) ద్వారా చెల్లించి రసీదు జతపరచి పరచాలి. (3) ఒకరు ఎన్ని ఎంట్రీలైనా పంపవచ్చు. ఆల్ కరెక్టు మొదలు రెండు తప్పులు వరకు గల ప్రతి కూపనుకు బహుమతి లభిస్తుంది. (4) ఆల్ కరెక్టుకు : 1000 రూ., 1, 2 తప్పులకు, లఘు సాహితికి వరుసగా 400, 300, 300 రూ॥. (5) ఎంట్రీలు తెల్ల కాగితములపై వ్రాసి పంపవచ్చును. విజేతల లిస్టు - జవాబులు 15-10-69 "విజయ జ్యోతి"లో. ఎలయువారు 30 పై॥ పంపండి. M.O. లు, ఎంట్రీలు పంపవలసిన అడ్రసు :—

Manager
**VIJAYASAHITHI**
ET h-andrapadu P. O., Kurnool (A. P.)

మేనేజరు, విజయ సాహితి
ఈ. తాండ్రపాడు (పోస్టు), కర్నూలు జిల్లా (ఆంధ్ర)

'ప్రశ్నావళి' శీర్షికకి ప్రశ్నలను పంపేవారు కవరుమీద స్పష్టంగా 'ప్రశ్నావళి,' ఆంధ్ర సచిత్ర వార పత్రిక, మద్రాసు—1.' అని వ్రాయకోరుతున్నాము.— సం॥



# వారఫలం

## 26-9-1969 శుక్రవారం మొదలు 2-10-1969 గురువారం వరకు

**మేషం**: కొన్ని వ్యవహారాల్లో మీరు ప్రయోజనం లేని శ్రమకు గురి కాగలరు. అధికవ్యయం జరుగుతుంది. వారం మధ్యలో వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీకృషి రాణిస్తుంది.

స్త్రీలకు:—వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి.

**వృషభం**: వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. వారంమధ్యలో ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం ఆఖరులో తిరిగి అనుకూల పరిస్థితులు యేర్పడతాయి.

స్త్రీలకు:—ఆరోగ్యం బాగా ఉండదు. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**మిథునం**: వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. వారం ఆఖరులో మీ తాలూకు వస్తువులు పోవచ్చును. అధిక వ్యయం జరుగుతుంది.

స్త్రీలకు:—బంధువులకు సహాయం చేస్తారు. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**కర్కాటకం**: వృత్తిలో అనుకూల వార్తలను వింటారు. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి. సాటివారి గౌరవం లభిస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు వారం ఆఖరులో లాభిస్తాయి. మిత్రుల సహాయం లభిస్తుంది.

స్త్రీలకు:—ఆరోగ్యం బాగా ఉంటుంది. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధించగలరు.

**సింహం**: లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. వృత్తిలో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో సంతోషకరమైన వార్తలను వింటారు. రావలసిన డబ్బు సమయానికి అందగలదు. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి.

స్త్రీలకు:—కుటుంబవ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**కన్య**: ప్రయత్నించిన ప్రతిపనీ సులువుగా నెరవేరుతుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు.

స్త్రీలకు:—ఆరోగ్యం బాగా ఉండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**తుల**: వ్యాపారంలో సాటివారితో పోటీ పెరుగుతుంది. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. ప్రయాణాలోచనలు చేస్తారు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వారం ఆఖరులో సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. ఆందోళన కలుగుతుంది.

స్త్రీలకు:—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**వృశ్చికం**: వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది. సాటివారితో మాట పట్టింపులు తగవు. నూతన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు లాభదాయకంగా ఉంటాయి.

స్త్రీలకు:—ఆరోగ్యం బాగా ఉంటుంది. దైవ కార్యాలు నెరవేరతాయి.

**ధనుస్సు**: సామాన్యమైన పనులకు కూడా విశేషమైన ప్రయత్నం చేయవలసి వస్తుంది. సాటివారిలో గౌరవం బాగా ఉంటుంది. ప్రయాణాలు ఫలిస్తాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం పెరుగుతుంది.

స్త్రీలకు:—పుణ్యకార్యాలు చేస్తారు. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**మకరం**: వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి.

స్త్రీలకు:—ఆరోగ్యం బాగా ఉంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కుంభం**: భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు లాభిస్తాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు. రాజకీయ వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. స్థిరాస్థి వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు.

స్త్రీలకు:—సంతోషకరమైన వార్తలను వింటారు. సాటివారిలో గౌరవం లభిస్తుంది.

**మీనం**: వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. అధికారుల వలన జరుగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు:—ఆరోగ్యం బాగా ఉంటుంది. బంధు మిత్రులను కల్సుకొంటారు.

—మహేష్

మీ తరుణ సౌందర్యాన్ని
పువ్వురేక మార్దవంగా
వుంచుకోండి




పాండ్స్ వానిషింగ్ క్రీమ్‌తో

పాండ్స్ వానిషింగ్ క్రీమ్‌లోగల ప్రత్యేక హ్యూమెక్టెంట్‌తో మీ చర్మమందలి స్వాభావిక తేమను వుంచుకోండి. పాండ్స్ వానిషింగ్‌క్రీమ్ మీ చర్మాన్ని సుకుమారంగా మార్దవంగా నిత్య యౌవనంగా వుంచి కాపాడుతుంది. దుమ్ము, వాతావరణాలనుండికూడా చర్మాన్ని రక్షిస్తుంది. అతి తేలికగా మంచులా వుండే వానిషింగ్ క్రీమ్ ఒక్కటే సమానంగా రాసుకోవచ్చు. లేకపోతే పౌడరుకు పునాదిగా రాసుకొని పౌడర్ అద్దుకుంటే గంటలకొద్దీ మీ సింగారము చెక్కుచెదరదు

పాండ్స్ వానిషింగ్‌క్రీమ్ పౌడర్‌కు విశిష్టమైన పునాది

చీసబ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ
(పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ.లో స్థాపితము)

# రచయిత్రి భర్త

(14-వ పేజీ తరువాయి)

వ్రాయలేదు. ఆమె ఫ్రెండ్సు, అభిమాన పాఠకులు 'ఏమిటీ మధ్య హఠాత్తుగా మాయమయ్యావ్? నీ కలం బద్ధకిస్తున్నట్టుందే?' అంటూ కుప్పలు కుప్పలుగా ఉత్తరాలు వ్రాయటం ప్రారంభించేరు. తన అభిమానుల సంఖ్యను చూసుకుని ఆనందంగా, గర్వంగా నవ్వుకుంది మాధవి.

పాప పుట్టిన నాలుగు నెలల తరువాత విజయవాడలో తెలుగు రచయిత్రుల సమావేశం జరిగింది. ఆ సమావేశ కార్యక్రమాల్లో తను ఒక ముఖ్యమైన ఉపన్యాసం యివ్వవలసి వుండటంవల్ల మాధవికి విజయవాడ వెళ్ళక తప్పలేదు. అయితే ఆమె ప్రయాణానికి పాప ఒక అవరోధం అయింది.

'నాలుగునెలల పిల్లను తీసుకువెళ్తే వాళ్లంతా ఏమనుకుంటారు? అదీకాక ఈ మండు వేసవిలో పసిపిల్లను అంత దూరం తీసుకుపోవటం మంచిదికాదు ఎలా? పోనీ నేను ప్రోగ్రామ్‌ని కాన్సిల్ చేసుకుంటాను' అన్నది దిగులుగా మాధవి.

'ఇలాటి అవకాశాలు ఏ యేడాదికోసారో తప్ప రావు నాల్గురోజులు కళ్ళు మూసుకుంటే సరి. పాపని నా దగ్గర ఉంచేసి నువ్వెళ్ళు' అన్నాడు వేణు.

అనటమే కాక ప్రయాణానికి అన్ని యేర్పాట్లు చేసి, ఆమెను బలవంతంగా ఒప్పించి పంపించేడు.

మాధవి లేని ఆ నాలుగు రోజుల్లోనూ నానా అవస్థలు పడ్డాడు వేణు. రోజూ మూడుగంటల కొకసారి పాలు కలిపి పాపకి పట్టటం, అది పాడుచేసిన బట్టల్ను తీసి అవతల పడెయ్యటం, ఏడిచినప్పుడల్లా సముదాయించటం యివన్నీ అలవాటు లేనందున చెయ్యటానికి కష్టంగా ఉండేది. దానికితోడు ఎంత ఏడుస్తున్నా మాధవి స్పర్శ తగలగానే యిట్టే ఏడుపు మానేసే పాప అతను ఎంత సముదాయించినా ఏడుపు మానదు సరికదా మరింత గుక్కపట్టి ఏడ్చేది. చివరకు అది ఏడుపు మానేసరికి యిద్దరికీ కూడా నీరసం వచ్చేది. ఐతే యివన్నీ పెద్ద సమస్యలుగా తోచలేదు వేణుకి.

సహజంగానే అతనికి పిల్లలంటే యిష్టం. అందునా తన రక్తాన్ని పంచుకుని మొదటిసారిగా పుట్టిన పాపంటే అతనికి పంచప్రాణాలూను. అచ్చి మాధవి పోలికలే పుణికి పుచ్చుకుని పుట్టిన పాపను చూస్తూ నాలుగురోజులూ మాధవి లేని లోటును కొంతవరకు మర్చిపోగలిగేడు వేణు.

కాని, మాధవిని అలా పంపి తనుపిల్లను దగ్గర పెట్టుకుని నాలుగురోజులు సెలవు మీద యింట్లో ఉండటం యిరుగుపొరుగు వారికీ, మిత్రులకు చాలా విడ్డూరంగా కనిపించింది.

పక్కింటి బామ్మగారు ఆ నాలుగు రోజుల్లోనూ కనీసం నంభై సార్లన్నా వచ్చి అతనికి సంభవించిన దుస్థితికి సానుభూతి వలకబోస్తూండేది.

'ఇంతకీ అమ్మాయి ఎక్కడికి వెళ్లిందన్నావ్? పాపని ఎందుకు తీసుకు వెళ్ళలేదన్నావ్?' అన్న ప్రశ్నను మరీ మరీ అడిగి తెలుసుకున్నా ఆవిడకి తృప్తి కలగలేదు.

చివరికి మనసుండబట్టలేక 'ఐనా యిదెక్కడి చోద్యం బాబూ, ఎంతమీటింగులయితే మాత్రం నాలుగునెలల పసికందుని వదిలి అట్లా పోతుందా? నీకైనా ఎలా తోచలేదు? ఆడదానికి అలుసిస్తే నెత్తికెక్కి కూర్చుంటుంది. ఆనక నీయిష్టం' అంటూ అక్కడికి తను ఆడదికానట్లు అతనికి సలహాయిచ్చి మరీ వెళ్లింది.

అతను సెలవుపెట్టిన రెండవరోజున ఆఫీసు వాళ్లిద్దరు వచ్చేరు అతనికోసం.

డాక్టర్ కబుర్లు

## ఎంఫిసీమాకి వ్యాయామం

ఎంఫిసీమా అనే జబ్బు - పరిస్థితి ఉంది. అదీ ఉబ్బసం వంటిదే. అయితే, ఇది ఉబ్బసం లాగ ఏదయినా పడక వచ్చేది కాదు ఊపిరితిత్తులలో మార్పుల



3.

వల్ల వచ్చేది. మధ్య వయస్సు తర్వాత ఇది చాలామందికి వస్తుంది.

ఆయాసంగా ఉంటుంది, ఊపిరి వదలటం కష్టంగా ఉంటుంది. రాత్రిపూట శ్వాస తీసేదారులలో కూడుకున్న కఫ పదార్థాలు ఊపిరితియ్యటానికి అడ్డుపడ్తాయి

దీనికి గుణం ఇచ్చే వ్యాయామం-ఊపిరి తీసేప్పుడు పొట్టని బయటికి తొయ్యాలి; బయటికి వదిలేప్పుడు లోపలికి లాగాలి. (తొందరగా లోపూపిరి, నెమ్మదిగా బయటి ఊపిరి)

నుంచుని బల్లమీదికి కొద్దిగా వంగి చేస్తే తేలికగా ఉంటుంది. కూర్చున్నప్పుడూ ముందుకి వంగవచ్చు. పడుకున్నప్పుడు పొట్ట మీద బరువు కొద్దిగా ఉండవచ్చు. దీనికోసం ప్రత్యేకంగా చేసి అమ్మే బెల్టులు ఉంటాయి, అవీ వాడవచ్చు.

హెచ్. ఎల్. హెర్బెన్‌సోన్

(కాపీరయిటు)

ఖర్మకొద్దీ ఆరోజు పనిమనిషి రాకపోవటం వల్ల పాప బట్టలన్నీ ఖరాబవటం వల్ల కొంచెం మంచిగా ఉన్నబట్టలు రెండు నీళ్ళల్లోముంచి ఆరేసేడు వేణు. సరీగ్గా అదే సమయానికి వచ్చేరు అతని ఆఫీసువాళ్ళు.

'అరెరె! అదేం పనోయ్!' అంటూ గావు కేకపెట్టేడొకతను.

'నువ్వు బాగానే ఉన్నావా? నాలుగు రోజులు సెలవుపెడ్తే ఆరోగ్యం బాగా లేదేమో ననుకున్నాం' అన్నాడు యింకొకతను.

'ఇంతకీ మీ శ్రీమతేది? ఆ బట్టలు నువ్వు ఆరవేస్తున్నా వెందుకు?'

'రేపటినుండి విజయవాడలో రచయిత్రుల సమావేశం జరుగుతోందికదూ? అందువల్ల మొన్నరాత్రే బయల్దేరివెళ్ళింది మాధవి' అన్నాడు వేణు.

'పసిపిల్లలను వదిలి వెళ్ళవలసినంత ఖర్మం పట్టిందంట? ఆ సమావేశాలు అంత గొప్పవేమిటి? ఆవిడకు యిల్లూ సంసారం కన్నా సభలూ, సమావేశాలె ముఖ్యమా?'

'ఆమెను నేనే బలవంతపెట్టి పంపించేనండీ! ఇలాటి అవకాశాలు అందరికీ అన్ని రోజుల్లోనూ రమ్మంటే రావుకదా. నాలుగు రోజులపాటు కళ్ళు మూసుకుంటే సరి—ఐనా నాపిల్లపనులు నేను చేసుకుంటే అందులో తప్పేముంది? అదేమంత అవమానకరమైన విషయం కాదనుకుంటాను.' అన్నాడు సీరియస్‌గా వేణు.

దాంతో ఆ మిత్రులిద్దరూ అతన్నో పిచ్చివాణ్ణి చూసినట్లు చూసేరు.

చివరకు 'ఆమె గొప్ప రచయిత్రే కావచ్చు. కాని ఆవిడ నీ భార్య అన్న విషయం మర్చిపోకు బ్రదర్! రచయిత్రిగా ఆమెను నువ్వు గౌరవించినా, భార్యగా అణచి ఉంచవలసిన భాధ్యత నీకుంది. తరువాత ఎంత విచారించీ లాభం లేదు' అని వెళ్ళిపోయేరు.

వాళ్ళన్న వాక్యాలు ఒక్కొక్కటే వచ్చి అతని గుండెకు ములుకుల్లా తాకినయ్. వాళ్ళన్న దాంట్లో నిజం లేకపోలేదేమో అనిపించింది కాసేపు. ఐనా యిప్పుడు మాధవిని కాన్ఫరెన్సుకి పంపినంత మాత్రాన అందులో అతిస్వేచ్ఛ నివ్వటమేముంది అనుకున్నాడు కాసేపు.

'నా పిల్లకోసం నేను శ్రమపడుతుంటే మధ్య వీళ్ళ కెందుకంత బాధ?' అన్న

ఆలోచనలో కొంసేపు పడ్డాడు వేణు.

ఆఖరుకి భార్యాభర్తల అన్యోన్యతను వాళ్ళకు పిల్లలమీదగల అవ్యాజానురాగా లను చూసి సహించగలిగేశక్తి నూటికి తొంభైతొమ్మిది మంది మనుషుల్లో ఉండదన్న నిర్ధారణకి వచ్చేడు వేణు. దానికి కారణం అంత ఉన్నతంగా, మన స్ఫూర్తిగా అందరూ తమవారిని ప్రేమించ లేక పోవటమే అనిపించిం దతనికి.

ఏది యేమైనా అతని మనసులో విలాటి దురుద్దేశాలు లేకపోయినా వాళ్ళూ వీళ్ళూ అన్నమాటలు అతనిని మన శ్శాంతికి దూరం చేసినయ్. ఊరికే పని మనిషిమీద, ఆఖరికి పసిదానిమీద కూడా చిరాకుపడటం మొదలెట్టేడు. అంతలోనే పశ్చాత్తాపం కలిగి పాప శరీరమంతా ముద్దులతో నింపేడు.

ఆ నాలుగురోజుల నరకం గడచేక మాధవి తిరిగి వచ్చింది. ఇంటికి రాగానే కాన్ఫరెన్సు విశేషాలను భర్తతో వివరంగా చెప్పాలని ఉత్సాహంతో వచ్చిన మాధవి భర్త ముఖం లోని నిర్లిప్తతను చూసి ఆశ్చర్యపోయింది.

ఎంతో బతిమాలి అడగగా తన అను భవాలన్నీ భార్యకు పూసగుచ్చినట్లు చెప్పేడు వేణు.

అంతా విని ఫక్కున నవ్వింది మాధవి. 'ఇంత చిన్న విషయానికే అంత బెంబేలు పడితే ఎలాగండీ! లోకులు కాకులని ఊరికే అన్నారా? ఎంతసేపూ ఎవరికివారు ఎదుటి వారి సంసారాన్నిగూర్చి ఆక్షేపించేవారే తప్ప తమ సంసారాల్లోని లొత్తులను గురించి ఎవరూ ఆలోచించుకోరు. మీ ఫ్రెండ్సందరికీ మనల్నిచూస్తే జెలసీ! తమలోని అసంతృప్తిని వాళ్ళీరకంగా పూడ్చుకుంటారు' అంటూ అతని నుదిటి మీద చిన్నగా ముద్దు పెట్టుకుంది. ఆమె స్పర్శ, ఆమె మాటలు అంతవరకు భగ భగ మండుతున్న అతని గుండెకు చల్ల దనాన్ని, హాయిని చేకూర్చినయ్.

ఐతే బయటికి వెళ్ళినప్పుడల్లా అతను వినేమాటలు, ఎదుర్కొనే అనుభవాలు మరల మరల అతని గుండెని పిండుతూనే ఉన్నాయ్.

చాలామంది సన్నిహితులు అతనిని పేరు పెట్టి పిలవటం మాని 'రచయిత్రి మొగుడుగారూ!' అనటం మొదలెట్టేరు.

# రచయిత్రి భర్త

ఐతే తనకిచ్చిన ఆ బిరుదులో గౌరవమే ఉన్నదో, హేళన ఉందో అర్థం కాలే దతనికి.

ఆ చిరాకును అడపాదడపా మాధవిమీద చూపటం, దానికి సమానమైన ప్రతి ఫలాన్ని ఆమెనుండి తిరిగి పొందటం కూడా జరుగుతుండేది.

అగ్గిమీద ఆజ్యం పోసినట్లు వేణులోని అశాంతిని రెచ్చగొట్టే మరో సంఘటన జరిగింది.

ఓరోజు సాయంత్రం మాధవి ముందు గదిలో కూర్చుని దీక్షగా వ్రాసుకుంటుంది. పక్కనే మంచంమీద పడుకుని పాపతో ఆడుకుంటున్నాడు వేణు.

ఇంతలో కిలకిలమన్న నవ్వులు వినిపించి యిద్దరూ బయటకు వచ్చేరు.

ఎవరో నలుగురమ్మాయిలు చూట్టానికి కాలేజీ విద్యార్థినులలా వున్నారు. 'మాధవి గారిల్లు యిదేనాండీ?' అనడిగేరు.

'ఔను. రండి' అంది మాధవి చిరు నవ్వుతో.

'ఇది వేణుగోపాలరావు ఇల్లు కాదిప్పుడు. మాధవిగారి యిల్లు' అనుకున్నాడు కసిగా వేణు మనసులో. అతను వెంటనే లోపలికి వెళ్ళిపోయేడు—'ఈయన మా భర్తగారు' అంటూ ఆ కాలేజీ అమ్మాయిలకు పరిచ యం చెయ్యబడటం యిష్టంలేక

ఆ అమ్మాయిలు నలుగురూ లోపలికి వచ్చి కుర్చీల్లో కూర్చుని మాధవిని నఖ శిఖ పర్యంతం... ఇసలీవిడ మానవజాతికి చెందిన స్త్రీయేనా కాదా అన్నట్లు పరిశీలనగా చూడసాగేరు.

ఆవిడకూడా తమలాంటి స్త్రీయే అన్న నిర్ధారణకి వచ్చిన తరువాత ఆమె అందంగా ఉన్నదా లేదా, ఎలాటి చీర కట్టుకుంది, ఏ రకంగా కట్టుకుంది, మెడలో పుస్తె తాడు, చేతికి మట్టిగాజులు ఉన్నవా లేవా మొదలైన అంశాలను క్షుణ్ణంగా చదివి తెలుసుకున్నారు.

ఆ పది నిమిషాల టైములోను, టీ కాచి తీసుకు వచ్చింది మాధవి.

టీ తాగేక చురుకుగా ఆమెను ప్రశ్నలు వెయ్యటం మొదలెట్టేరు. 'మీ రెంతవరకు చదువుకున్నారు?' 'మీ వయసెంత?' 'మీవారి ఉద్యోగం ఏమిటి?' 'ఎంతమంది పిల్లలు?' 'ఏయే సమయాల్లో మీరు వ్రాస్తుంటారు?' 'మీకు మూడ్ రావా లంటె ఏం చేస్తారు?' 'ముందుకథంతా మనసులో అనుకుని వ్రాస్తారా, లేక అప్పటి కప్పుడు కలం ఎలా సాగితే అలా వ్రాస్తారా?' అన్నవి వాళ్ళడిగిన ముఖ్య మైన ప్రశ్నలలో కొన్ని.

అన్నిటికీ ఓపికగా మాధవి సమాధానా లిస్తుంటే ఆ ఆడవాళ్ల ప్రశ్నోత్తరాలన పక్కగదిలోకూర్చుని ఉత్సాహంగా వింటున్న వేణు, 'మీరేమీ అనుకోకుండా ఉంటే నా కందరికీ ఓ ప్రశ్న అడ గాలనుంది...మీ దాంపత్య జీవితాన్నిగూర్చి మీరెలా ఫీలవు తున్నారు? — యింకా సింపుల్‌గా అడగా లంటే — మీ ఆయన మిమ్మల్ని బాగా చూస్తారా?' అన్న ప్రశ్న విని గతుక్కు మన్నాడు.

మాధవికూడా తత్తరపడింది. 'ఇదే మిటి? ఎందుకలా అడుగుతున్నారు?' అనడిగింది హీనస్వరంతో.

'మీ రచనల్లో ఎప్పుడూ మీరు పురుషు లను దుయ్యబడుతుంటారు. భర్తవల్ల కష్టాలు పడుతున్న స్త్రీలమీద సాను భూతి చూపిస్తూంటారు. అందుకే మాకీ సందేహం కలిగింది. ఎంతకథలైనా స్వాను భవాలు కొన్ని రచయితలు తమ రచనల్లో చూపక మానరు.'

రెండు క్షణాల నిశ్శబ్దం తరువాత మాధవి అంది 'మీ రడిగిన ఈ ప్రశ్న నా రచనలనుగురించి ఓ సారి నేనే ఆలో చించు కునేట్లు చేస్తోంది. ఐనా మీరు సూటిగా అడిగేరు కనుక నేను కూడా సూటిగానే సమాధానం చెప్తున్నాను. ఆయన మీ భాషలో నన్ను బాగానే చూస్తారు. మరొక్క సంగతేమంటే నేనా రకమైన రచనలు చెయ్యటానికి మావారి ప్రోత్సా హము. మనఃపూర్వకమైన అంగీకారము ఎల్లవేళలా నాకు లభిస్తున్నాయ్.'

ఆ తరువాత అరగంటసేపూ వాళ్లేం మాట్లాడుకుందీ వినపడలేదు వేణుకి. ఐతే ఒక్కటే మాత్రం అనుకున్నాడు. 'వీళ్లంతా ఈ రచయిత్రులను అడగవలసింది 'మీ వారు మిమ్మల్ని బాగా చూస్తారా?' అని కాదు. 'మీరు మీవారిని బాగాచూస్తారా?' అని అడగాలి' అని.

ఆ సంఘటన తరువాత మాధవి తన రచనలలో మగవాళ్ళను – ముఖ్యంగా భర్తలను దుయ్యబట్టటం తగ్గించుకుంది.

కాని వేణులోమాత్రం నానాటికీ విరక్తిలాటి భావమేదో గడ్డకట్టుకో సాగింది. రచయిత్రిగా మాధవి పేరుప్రతిష్ఠలు యినుమడిస్తున్న కొలదీ అతను భార్యకు మానసికంగా దూరం కాసాగేడు.

ఆ రోజు ఆఫీసునుండి చాలా చిరాగ్గా వచ్చేడు వేణు. దానికి కారణం ఆఫీసులో అతని మిత్రులు అడిగిన కొన్ని ప్రశ్నలే!

ఏదో మాటల సందర్భంలో వేణు నానాటికీ పెరిగిపోతున్న ధరలు, ఎదుగూ బొదుగూలేని సామాన్య ఉద్యోగస్తుల జీతాలను గురించి మాట్లాడుతుంటే ఒకతను అందుకుని 'నీకేమోయ్' రెండు చేతులా సంపాదిస్తున్నావ్.' అన్నాడు.

'అదేం ? మీరంతా ఒక్కచేత్తోనే సంపాదిస్తున్నారేమిటి' అన్నాడు నవ్వుతూ వేణు.

'అదికాదోయ్. నీ భార్య రచనలమీద కూడా డబ్బు వస్తుందిగా. అదంతా బాంకులో వేస్తూనే ఉండిఉంటావ్' అన్నాడు ఇంకొకతను

'ఇంతకీ ఒక్కో కథకి ఎంతపైకం ముట్టచెప్తారోయ్?' అని ఆత్రంగా అడిగేడు మరొకతను.

'వాళ్ళేం వందలు వేలూ యివ్వరు– బాంకులో దాచుకుంటానికి–' కోపాన్ని దిగమింగుకోటానికి శాయశక్తులా ప్రయత్నిస్తూ అన్నాడు వేణు.

'దాచుకునే డబ్బునుగురించి ఎవరు మాత్రం పైకి చెప్పుకుంటార్లే!' ఒకతను విసిరేడు.

మొత్తానికి ఆ సంభాషణ వేణు మనసుని తీవ్రంగా గాయపరచింది. వాళ్ళందరూ తనని చూసి అసూయ పడటమేకాక పరోక్షంగా తనని అవమానిస్తున్నట్టు భావించుకుని కించపడ్డాడు.

ఆ రకమైన మనస్థితిలో అతను యింటికి చేరుకునేసరికి ఎదురుగా మాధవి తల్లిదండ్రులిద్దరూ కనపడ్డారు

చెప్పాపెట్టకుండా ఊడిపడ్డ అత్తమామలను చూస్తే ఆ సమయంలో చెడ్డ చిరాకేసింది వేణుకి. పైగా దిగులుగా ముభావంగా ఉన్న వారి ముఖాలను చూసి 'ఏమైనా చావు కబురు తేలేదుకదా మహాను భావులు.' అనుకున్నాడు.

మర్యాదగా వాళ్ళని పలకరించి లోపలికి వెళ్ళేడు. స్నానం, టిఫిన్ అన్నీ అయి తీరికగా అతను కూర్చున్నాక అత్తమామలిద్దరూ వచ్చి, మెల్లగా అతని పంచన చేరేరు.

కొన్ని నిమిషాలు గడచేసరికి ముక్కు చీదిన శబ్దం వినపడేసరికి వేణు ఉలికిపడి అత్తగారివంక చూసేడు.

ఓ చిన్నదగ్గుదగ్గి వేణు మామ మొదలెట్టేడు. 'చూడు అల్లుడూ. సంసారమన్న తరువాత భార్యాభర్తలమధ్య ఏవో మాటామాటా రావటం మామూలే. అంతమాత్రాన భార్యాభర్తలు ఒకరిపై ఒకరు ద్వేషం పెంచుకోవటం, దెబ్బలాటలకు దిగటం మంచిదికాదు నాయనా! నువ్వా చదువుకున్నవాడివి. బుద్ధిమంతుడివి. మీ నాన్నా, నేనూ చిన్ననాటి స్నేహితులం. అందుకే ఎవరెన్నిమాటలు చెప్పినా వినకుండా పట్టుబట్టి అమ్మాయిని నీకిచ్చేం!' అంటూ ఆగి భార్యవంక చూసేడు.

ఈ ఉపోద్ఘాతమంతా దేనికోసమో అర్థం కాలేదు వేణుకి. అదే సంగతి పైకి అన్నాడు. 'మీరేమంటొందీ నా కర్థం కావటం లేదండీ!' అని

డొంకతిరుగుడుగా అదీ యిదీ అని అరగంట తరువాత అత్తమామ లిద్దరూ

## శ్రావ్యానుగేయాలు

*** శశిర ***

(గత సంచిక తరువాయి)

12. దలంపాటి వెంకటగుడి
రసిక హృదయపద్మ హేళి
సెక్సుముదిరి సన్యసించె
రమణాశ్రమ పాదధూళి.

V







14. రంగస్థల నాయకమ్మ
తేనె తుట్టెవంటి కొమ్మ
విమర్శించ ముంగోపం
అడపిల్లకిద పాపం.

(ఇంకా ఉంది)

13. శాస్త్రిపాద సుబ్రమణ్య
వదన రదన సొగసగణ్య
మననుకరణ సాధ్యసృష్టి
నవరసాల కుంభ వృష్టి. V




## రచయిత్రి భర్త

తేల్చిన విషయమేమంటే యిటీవల మాధవి వ్రాసిన ఒక నవలను వాళ్ళు చదవటం జరిగింది. అందులో రచయిత్రి అయిన భార్యను ఎన్నోరకాలుగా హింసలుపెట్టే భర్తను చిత్రించింది. మాధవి తన సంసారంలో జరిగిన విషయాలనే యథాతథంగా చిత్రించిందని ఆ వృద్ధదంపతుల దృఢ విశ్వాసం. కాబట్టి అల్లుణ్ణి కాస్త మర్యాదగా మందలించిపోదామని పడుతూ లేస్తూ వచ్చేరు.

అంతా విన్నాక వేణుకి నవ్వాలో, ఏడవాలో అర్థం కాలేదు.

'అదేదో కథలో వ్రాస్తే మధ్యన మీరు నాకు నీతులు చెప్పటమెందుకండీ ?' అన్నాడు వేణు.

'ఇంతకీ అది వ్రాసిందంతా నిజమా కాదా?' నిలదీసి అడిగేడు మామగారు.

'ఆ సంగతి మీ అమ్మాయినే అడగరాదూ?'

'ఇంట్లో నిజంగా ఏమీ జరగకపోతే అదెందుకలా వ్రాస్తుందీ?' అంటూ సాగదీసింది అత్తగారు.

'అదేదో బుద్ధి గడ్డితిని అడ్డమైన చెత్తా వ్రాస్తే దానికి మీరు నన్ను యిలా క్రాస్ ఎగ్జామిన్ చెయ్యటం ఏమీ బాగా లేదు మామగారూ!' అంటూ విసుగ్గా కుర్చీలోనుండి లేచేడు వేణు.

'అదికాదు అల్లుడూ...' అంటూ అతనిని కూర్చోబెట్టి మళ్ళీ నీతిబోధ మొదలెట్టేడు ముసలాయన.

చివరికి ఆ దంపతులకు మాధవిని తనేమీ కష్టపెట్టటం లేదనీ, తమ సంసారంలో ఎలాటి కలతలూ లేవనీ అర్థమయ్యేట్లు చెప్పేసరికి అతని తలప్రాణం తోక వొచ్చినంత పని జరిగింది.

భారతీయ కర్మ సిద్ధాంతంపైన, పునర్జన్మమీద అమితమైన విశ్వాసంగల వేణుగోపాల్ ఆ రాత్రి పడుకోబోయేముందు భగవంతుణ్ణి యిలా ప్రార్థించేడు. 'ఓ ప్రభూ! నాకు మళ్ళీ జన్మ అనేది ఉంటే (ఉండకేం చేస్తుందిలే) నన్ను కుక్కగా, నక్కగా, పిల్లిగా, పిట్టగా; ఎలాగైనా పుట్టించుగానీ, రచయిత్రి భర్తగా మాత్రం వద్దు.' ●

# సినిమా

శ్రీ 'కథానాయకుడు' 'విచిత్ర కుటుంబం' చిత్రాలకు సంభాషణలను సమకూర్చిన శ్రీ బమిడిపాటి రాధాకృష్ణ పద్మశ్రీ పిక్చర్స్ వారి 'అల్లుడే మేనల్లుడు' చిత్రానికి కథ మాటలను వ్రాశారు. పేరుని బట్టి యిది వినోద ప్రధానమైన కథ అని నిర్ణయించుకోవచ్చు. 'వింత కాపురం' చిత్రాన్ని డైరెక్టుచేసిన శ్రీ అబ్బి (వి. వి. సుబ్బారావు) ఈ చిత్రానికి కూడా దర్శకుడు. సెప్టెంబరు 14 న ప్రారంభించబడే ఈ హాస్యరస ప్రధానమయిన చిత్రంలోని ముఖ్య భూమికలను శ్రీయుతులు కృష్ణ, నాగభూషణం, రాజబాబు, కృష్ణంరాజు, ధూళిపాళ. విజయనిర్మల, సూర్యకాంతం, రమాప్రభ ధరిస్తున్నారు ఈ చిత్రం యొక్క షూటింగు మద్రాసులో జరుగుతుంది; శ్రీ వి. వెంకటేశ్వర్లు నిర్మించే ఈ చిత్రాన్ని శ్రీ ఫిలింస్ విడుదల చేస్తారు.

*　　*　　*

జగపతి ఫిలింస్ సారథి స్టూడియోలో నిర్మిస్తున్న 'అక్కాచెల్లెలు' షూటింగు శరవేగంగా సాగిపోతుంది. శ్రీ వి కృష్ణ ప్రసాద్ నిర్మించే ఈ చిత్రానికి శ్రీ అక్కినేని సంజీవి దర్శకుడు; శ్రీ ఆత్రేయ మాటలను వ్రాసిన ఈ చిత్రంలోని ప్రధాన పాత్రలను అక్కినేని నాగేశ్వరరావు, కృష్ణ, గుమ్మడి, 'షావుకారు' జానకి, విజయనిర్మల, పద్మనాభం, విజయలలిత, రమాప్రభ మరియు శాంతకుమారి పోషిస్తున్నారు. ఈ చిత్రానికి శ్రీ వెంకటరత్నం ఛాయను, శ్రీ మహదేవన్ సంగీతాన్ని, శ్రీ జి. వి. సుబ్బారావు కళను నిర్వహిస్తున్నారు దర్శకుడు శ్రీ సంజీవి కూర్పును, జైహింద్ సత్యం స్టిల్సును నిర్వహిస్తున్న ఈ చిత్రం లక్ష్మీ ఫిలింస్ ద్వారా అతి త్వరలో విడుదలౌతుంది.

*　　*　　*

విశ్వశాంతి పిక్చర్స్ 'పెత్తందార్లు' అనెడి సముజ్వల సాంఘిక చిత్రాన్ని నిర్మిస్తున్నారు. ఈ చిత్రానికి శ్రీ సి. ఎస్ రావు దర్శకుడు; శ్రీ మహదేవన్ సంగీతకుడు; శ్రీ జి.కె. రాము ఛాయాగ్రాహకుడు;

# తెరపై "ముద్దు" కావాలా? వద్దా?

తెలుగు తెరపై "ముద్దు" వుండాలా? వద్దా? అనేది ప్రశ్నపై మన చలనచిత్ర ప్రముఖులు వెల్లడించిన వ్యక్తిగత అభిప్రాయాలను వారం వారం ఈ శీర్షిక క్రింద పొందుపరచడం జరుగుతుంది.

**ముఖ్యాంశమా...?**

**శ్రీ ఎన్. టి. రామారావు:**



'మనం భారతీయులం. మనకు, మన సంస్కృతికి విదేశాలలో ప్రత్యేక గౌరవం, అభిమానంవుంది 'ముద్దు' మన ఆచార వ్యవహారాలకు (బాహాటప్రదర్శనకు) విరుద్ధం. మన పరిశ్రమలో ఎన్నో గడ్డు సమస్యలున్నాయి. ఇది చర్చించదగిన ముఖ్యాంశంగా నాకు కనిపించడం లేదు' అన్నారు.

**ఆరోగ్య కరంకాదు ...**

**శ్రీమతి సావిత్రి:**



శ్రీ రామారావుగార్ని సమర్థిస్తూ యిలా అన్నారు 'మన అలవాట్లకు, మన నాగరికతకు 'ముద్దు' ఆక్షేపణీయం శృంగారాన్ని సినిమాలలో చూపించడానికి 'ముద్దు' అనవసరం. ఇది ప్రేక్షకులకు జుగుప్సను కల్గిస్తుంది. మన పరిశ్రమకు ఆరోగ్యకరం కాదని అభిప్రాయపడుతున్నాము' అన్నారు.

**మనచేతుల్లో లేనిది ...**

**శ్రీ నాగభూషణం:**



'మనం చాల వరకు పాశ్చాత్య నాగరికతకుదగ్గరవాళ్ళమై పోతున్నాం. కాలప్రవాహంలో ఎప్పుడు, ఏది ఎలా జరుగుతుందో మనం చెప్పలేం. కానీ, 'ముద్దు' వుండడం, లేకపోవడం మన చేతుల్లో లేదు' అన్నారు.

**నిడివిలో పొదుపు ...**

**శ్రీ విఠలాచార్య:**

'ముద్దు' ప్రవేశం నాకు ఆనందదాయకమే. కానీ, సన్నివేశానుగుణ్యంగా ప్రవేశపెట్టడంలో యెలాంటి అభ్యంతరం వుండదు. ఇప్పుడు మన సినిమాలలో శృంగార ఘట్టాన్ని చూపించాలంటే ఒక డ్యూయెట్, ఆపైన నాయికా నాయకుల వుపోద్ఘాతం చిత్రీకరించాలి. నిడివి 800 అడుగుల వరకు అవుతుంది. 'ముద్దు' ప్రవేశపెడితే 10, 15 అడుగుల్లో ఆ ఘట్టానికి పరిపూర్ణత చేకూరుతుంది' అన్నారు.

సేకరణ: శ్రీనివాస్.



'చిచ్చరపిడుగు'లో కాంతారావు, జ్యోతిలక్ష్మి

శ్రీ మహారధి మాటలను వ్రాసే ఈ చిత్రంలోని ప్రధానపాత్రలను ఎన్.టి. రామారావు, సావిత్రి, నాగభూషణం, ప్రభాకరరెడ్డి, సత్యనారాయణ, రాజబాబు పోషిస్తున్నారు. ఈ చిత్రం జోతి పిక్చర్స్ ద్వారా విడుదలౌతుంది.

*   *   *

విశ్వశాంతి అధినేత శ్రీ యు. విశ్వేశ్వరరావు హిబిబుల్లా రోడ్డులోని 'విశ్వశాంతి గార్డెన్స్'లోనికి గృహప్రవేశం చేసారు; ఆఫీసు ఉస్మాన్ రోడ్డులో వున్నది.

*   *   *

## సినివహా

శ్రీ వై. వి. రావు రెండవ చిత్రాన్ని అక్టోబరులో ప్రారంభిస్తున్నారు. శ్రీ కె. వి. ఎస్. కుటుంబరావు ప్రప్రథమంగా దర్శకత్వం నెరపనున్న యీ చిత్రానికి 'ద్రోహి' అని పేరుపెట్టారు. చిత్రంలోని ప్రధానపాత్రలను శ్రీయుతులు కృష్ణ, విజయనిర్మల, సత్యనారాయణ, విజయలలిత, రాజబాబు పోషిస్తారు.

జీవితాన్ని సుఖసంతోషాలతోను, విలాసవస్తువులతోను గడపడమే లక్ష్యంగా గొన్న శ్రీ ప్రభాకరరెడ్డిని వసాల విసనకర్ర అయిన విజయలలిత తన శృంగార కేళి విలాసాలతో కవ్వించి రెడ్డిగారిని తన ఆటపాటలతో మెప్పించింది.

మై నేమ్ యీజ్ రోజీ
నామనసే విరజాజీ
ప్రతిమావు ఒక కిరణం

ప్రతిమావు ఒక కెరటం, అంటూ పాడుతుంటే, ప్రభాకరరెడ్డిలో ఆవేశం, ఆరాటం అధిగమించి ఆమెను అమాంతంగా మింగేస్తాడా అనిపించింది. ఈ రసవత్తరమయిన సన్నివేశాన్ని శ్రీమతి సావిత్రి 'మాతృదేవత' చిత్రానికిగాను, ప్రసిద్ధ స్టూడియోలో చిత్రీకరించారు శ్రీ అట్లూరి పూర్ణచం, దరావు నిర్మించే యీ చిత్రానికి



'మెరుపు వీరుడు'లో రాజశ్రీ.

శేఖర్‌సింగ్‌లు ఛాయను, కె. వి. మహాదేవన్ సంగీతాన్ని, బి. ఎస్. కృష్ణ కళను పీతాంబరం మేకప్‌ను నిర్వహిస్తున్నారు. పైపాటను నారాయణరెడ్డి వ్రాసారు. పూర్ణాపిక్చర్స్ విడుదలచేసే యీ చిత్రంలోని ప్రధాన పాత్రలను ఎన్. టి. రామారావు, సావిత్రి, చంద్రకళ, నాగభూషణం, రేలంగి, శోభన్‌బాబు, రాజబాబు, ప్రభాకరరెడ్డి, హేమలత పోషిస్తున్నారు.

*   *   *

అందాల నటుడు శ్రీ ఎన్. టి. రామారావును, అభినయ సరస్వతి సరోజాదేవి గాఢంగా ప్రేమించింది. ఆమెతండ్రి ధూళిపాళ స్వర్గస్తులు కావడంతో, ఆమె

## సినిమా డైరీ

● సీనస్ పిక్చర్స్ షూటింగు శ్రీ వి. మధుసూదనరావు దర్శకత్వంలో సెప్టెంబరు 10 నుండి 13 వరకు విజయా స్టూడియోలో (సీనస్, పద్మిని లిలీస్) జరిగింది. శ్రీయుతులు నాగేశ్వరరావు, కాంచన పాల్గొన్నారు.

● జ్యోతి సినీ సిండికేటు "పెత్తందార్లు" షూటింగు శ్రీ సి. ఎస్. రావు నిర్దేశకత్వంలో సెప్టెంబరు 7 నుండి 14 వరకు జరిగింది. రామారావు, ప్రభాకరరెడ్డి, సావిత్రి, సత్యనారాయణ, సంధ్యారాణి, నాగయ్య, హేమలత, ముక్కామల, రావు గోపాలరావు పాల్గొన్నారు.

● సురేష్ మూవీస్ "సిపాయి చిన్నయ్య" అవుట్‌డోర్ షూటింగు సెప్టెంబరు 7, 8 తేదుల్లో తెనాలిలో జరిగింది. శ్రీ శేషగిరిరావు దర్శకత్వంలో నాగేశ్వరరావు గారు పాల్గొన్నారు.

● మహాలక్ష్మి మూవీస్ "మూనాన్న నిర్దోషి" షూటింగులో శ్రీయుతులు కృష్ణ, విజయనిర్మల, గుమ్మడి, నాగభూషణం, సూర్యకాంతం పాల్గొన్నారు. శ్రీ వందనరావు డైరెక్టు చేశారు.

● విజయలలిత పిక్చర్స్‌వారి జానపదం షూటింగు శారదా స్టూడియోలో సెప్టెంబరు 6 నుండి 10 వరకు జరిగింది. శ్రీ కె. ఎస్. ఆర్. దాసు దర్శకత్వంలో సత్యనారాయణ, ధూళిపాళ, రాజశ్రీ, రాజబాబు, త్యాగరాజు మరియు రామకృష్ణ పాల్గొన్నారు.

పిచ్చికి అయింది! ఆమెకు దిక్కుతోచలేదు! నేరుగా రామారావుగారింటికి బయల్దేరింది; వెళ్ళి గుమ్మందగ్గర ఆగింది; లోపలి సంగుసలు చెవినిబడింది; రామారావుగారి తల్లి హేమలతకు సాక్షి రంగారావు సరోజా దేవి నడతను తేలిగ్గా మాట్లాడుతున్న మాటలు సమ్మెటపోట్లలా అనిపించాయి "నాగొంతులో ప్రాణంవుండగా యిలాంటి పిచ్చి సంబంధానికి ఒప్పుకోను; నా కుమారుడికి ఆమెకు పెళ్ళా? అది కలలోమాట' అంటూ రుసరుసలాడింది. సరోజాదేవి గుండె గుభేలుమంది; కన్నీరు కారుస్తూ వెనక్కు వెళ్ళింది. ఈ హృదయ విదారక



'ఉక్కుపిడుగు'లో మీనాకుమారి

మయిన సన్నివేశాన్ని శ్రీ కమలాకర కామేశ్వర రావు భవానీ ఫిలింస్ 'గుణవంతులు' చిత్రానికిగాను ప్రసాద్ స్టూడియోలోని మరో ఫ్లోర్‌లో చిత్రీకరించారు. శ్రీ బాపయ్య సంత్రులు నిర్మిస్తున్న యీ చిత్రానికి సెల్వప్ప ఛాయను, బి. ఎస్. కృష్ణ కళను, అశ్వత్థామ మ్యూజిక్‌ను నిర్వహిస్తున్నారు చిత్రంలోని యితర ముఖ్యభూమికలను నాగభూషణం, శోభన్‌బాబు, లక్ష్మి, రాజబాబు. రమాప్రభ, ధూళిపాళ, హేమలత ధరిస్తున్నారు. ఈ చిత్రం పూర్ణా పిక్చర్స్‌ద్వారా విడుదలౌతుంది

* * *

రామారావు సర్వలక్షణ సమన్వితుడు; జాణ. వీరిద్దరూ విధినై ఒక విచిత్ర అసాధారణ ప్రజ్ఞావంతుడు, కుమారి మయిన స్థలంలో కలుసుకుంటారు. రాజశ్రీ అందాలబరిణె; సుకుమార శరీర; కళ్ళా కళ్ళా కలుపుకుంటారు; రామారావుకు అన్నివిధాలా సరితూగగల వారిద్దరూ హుషారుగా పాడుతూ ప్రేమ

# సినివార్త

ప్రవేశానికి వెళ్ళిపోయారు.

రామారావు: కిలకిల బుల్లెమ్మా, కిలాడి బుల్లెమ్మా నీ ఒంటిమీద చెయ్ వెయ్యంగానే ఉలికిపడతావే

రాజశ్రీ: బడాయి మావయ్యా హడావుడేందయ్యో, నీవు పట్టపగలు నన్ను పట్టుకొంటవూ పరువు పోతదయ్యో

అని పాడుతూ ఒకరొకరు వెనవెనుకు పోతారు. ఈ మధురాతి మధురమయిన సన్నివేశాన్ని పి ఎస్ ఆర్ పిక్చర్స్ కగాను శ్రీ విఠలాచార్య వాహినిలో చిత్రించారు. శ్రీ పింజల సుబ్బారావు నిర్మిస్తున్న ఈ జానపద చిత్రానికి వేణు ఛాయను, నాగేశ్వరరావు కళను, కోదండపాణి సంగీతాన్ని నిర్వహిస్తున్నారు. ఈ చిత్రంలోని యితర ముఖ్య పాత్రలను ఎన్ టి రామారావు, కె ఆర్ విజయ, రాజశ్రీ, సత్యనారాయణ, బాలయ్య, ప్రభాకరరెడ్డి, బాలకృష్ణ, దనశ్రీ, పేమలత ధరిస్తారు. ఈ చిత్రాన్ని రాయల ఫిలింస్ టి నాగేశ్వరరావు విడుదల చేస్తారు.

* * *

నటి మీనాకుమారిని రాజబాబు, మోదుకూరి సత్యం ప్రేమిస్తారు, ఆమె ఇద్దరితోనూ సరదాగా వుంటుంది, ఆమెను యిద్దరూ తమ బుద్ధిచాతుర్యంతో మెప్పించాలనుకుంటారు.

ఒకరోజు మీనాకుమారి ఒంటరిగా నిలబడి వుంటుంది. మోదుకూరి సత్యం వచ్చి తన ప్రేమపురాణాన్ని విప్పి చెపుతుంటాడు. రాజబాబు ఆడవేషంలో నలుగురి బిడ్డలను అక్కడికి తీసుకొస్తాడు. వచ్చి ఏం చేశాడో తెలుసా?

'నువ్విక్కడున్నావా? ఏం నన్ను మరచి పోయావా' అమ్మా, తల్లీ (మీనాకుమారితో) ఇతనే నా భర్త చూడమ్మా ఈ నలుగురు ఆయనకు పుట్టినబిడ్డలు. నేనే ఆయన భార్యను' ఆ మాటలు విన్న మీనాకుమారి అదిరిపడింది, సత్యాన్ని నాలుగు గోదీ వంపించింది. ఈ తమాషా ఘట్టం నవభారత్ కంబైన్స్‌వారి 'ఉక్కుపిడుగు'లో కనిపిస్తుంది. శ్రీ ప్రకాశరావు మరియు సుధాకరరెడ్డి నిర్మిస్తున్న ఈ చిత్రానికి జి విశ్వనాథం దర్శకుడు. పూర్ణా పిక్చర్స్ ద్వారా విడుదలకానున్న ఈ చిత్రానికి వదు ఛాయను, కోదండపాణి సంగీతాన్ని, పూర్ణచంద్రరావు నిర్వహణను కొనసాగించారు. ఈ చిత్రంలోని ప్రధాన పాత్రలను కాంతారావు, రాజశ్రీ, రాజనాల, సత్యనారాయణ, విజయలలిత, ప్రభాకరరెడ్డి, రాజబాబు, మీనాకుమారి, చిరంజీవి ధరించారు.

* * *

కె ఆర్ విజయ తన ఫ్రెండ్స్‌తో పిక్నిక్‌కు వెళ్తుంది. మార్గమధ్యంలో హరనాథ్‌ను కలుసుకుంటుంది. అతనివాడును వాదకుంటుంది. తిరిగి వచ్చేప్పుడు హరనాథ్‌కు తనయింట్లో టీయిచ్చి సత్కరిస్తుంది. తీరా చూస్తే వాళ్ళిద్దరూ యిరుగు పొరుగు వారేనని తెలిసింది, ఇద్దరి యిండ్లకు మధ్య గోడొక్కటె అడ్డంపెట్టి నిల్చింది. గోడకు అవలవైపున కె ఆర్. విజయ ప్రతిదినం కూర్చుని పుస్తకం చదవడం, ఆ సమయానికి హరనాథ యివతలవైపున నిచ్చెనాకి ఆమెకు టీ అందించడం పరిపాటయింది, అది మదిరి ప్రేమగా మారింది, ఆ ప్రేమ పరిణయంలో ముగిసింది, ఈ పెండ్లివ్యవహారం ఒక్క పరమాత్మకే తెలిసిన విషయం. హరనాథ్ జపాన్‌వెళ్ళడం సంభవించింది. ఇక్కడ కె ఆర్ విజయ వేయికండ్లతో తన భర్తరాకను ఎదురుచూస్తూ వుండంది, హరనాథ్ వచ్చాడా, విజయను ఏలుకున్నాడా? అనేది ప్రశ్నకు శ్రీ బి ఎస్ నారాయణ దర్శకత్వంలో వెలువడ



'ప్రతీకారం'లో హరనాథ్, చంద్రకళ



ప్రణవా పిక్చర్స్‌వారి ప్రథమ చిత్రంలో గుమ్మడి, వాణిశ్రీ

పెళ్ళికానుక చిత్రం నిర్మాతలయిన వినస్‌పిక్చర్స్ తమ పౌరాణిక చిత్రంయొక్క షూటింగును సెప్టెంబరు 10 న ప్రారంభించారు నవయుగా శ్రీ శ్రీనివాసరావు స్విచ్ ఆన్ చేసారు. ఈ చిత్రానికి మధుసూదనరావు దర్శకత్వాన్ని, రామకృష్ణ ఛాయాగ్రహణాన్ని, రాజేశ్వరరావు సంగీతాన్ని ఆరుద్ర రచనావిభాగాన్ని నిర్వహిస్తున్నారు చిత్రంలోని ప్రధ పాత్రలను నాగేశ్వరరావు, వాణిశ్రీ, కాంచన, గీతాంజలి, పద్మనాభం కృష్ణంరాజు పోషిస్తున్నారు ఈ



'అందంకోసం పందెం'లో కాంతారావు, కాంచన

చిత్రానికి శాస్త్రి (ప్రతిభా) నిర్మాణ నిర్వాహకుడు; నవయుగా ద్వారా విడుదలౌతుంది.

* * *

జ్యోతి సినీ సిండికేటు భారీ ఎత్తున నిర్మిస్తున్న 'పెత్తందార్లు' శ్రీ సి ఎస్ రావు దర్శకత్వంలో తయారవుతున్నది శ్రీ మహారథి రచనను, కె వి మహాదేవన్ సంగీతాన్ని, జి కె రాము ఛాయను, కృష్ణారావు కళా దర్శకత్వాన్ని నిర్వహించే ఈ సమస్యాత్మకమయిన సాంఘిక చిత్రంలోని ముఖ్యభూమికలను రామారావు, సావిత్రి, ప్రభాకరరెడ్డి, విజయనిర్మల, శోభన్‌బాబు, సంధ్యారాణి, రాజబాబు, రమాప్రభ, నాగయ్య, హేమలత, సత్యనారాయణ, ముక్కామల, ధూళిపాళ, అల్లు రామలింగయ్య, రావు గోపాలరావు, విజయలలిత, జ్యోతిలక్ష్మి, టి జి కమల, ఝాన్సీ మరియు రేలంగి అండ్ నాగభూషణం ధరిస్తున్నారు; ప్రొడక్షన్ కంట్రోలర్‌గా శ్రీ రాధాకృష్ణ, వారికి సహాయకుడిగా ఎ కె వి ప్రసాద్, దుస్తులు శోభను నారాయణరావు, కూర్పును హనుమంతరావు, సహాయ దర్శకత్వాన్ని రంగస్వామి, దయాసాగర్ నిర్వహిస్తున్నారు

—శ్రీనివాస్

మనిషిని కదలించే, మనసును కరగించే
అనుబంధమే అన్నతమ్ముల రక్త సంబంధం

తారకరామ పిక్చర్స్ వారి

# భలే తమ్ముడు

దర్శకత్వం: బి.ఏ.సుబ్బారావు
నిర్మాత: ఎ.పుండరీకాక్షయ్య




Edited, Printed and Published by S Radhakrishna at the Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor. S. Sambhu Prasad.

Regd No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.

# మీ పాపని జలుబుతో బాధపడనిస్తా

## అక్కరలేదు..!

**విక్స్ వేపొరబ్ జలుబు భారాన్ని వెంటనే తొలగిస్తుంది. ముక్కు దిబ్బడ పోగొ**
**తేలిగ్గా ఊపిరి తీసుకోనిస్తుంది. పాపహాయిగా, చక్కగా నిద్రపోతుంది.**

విక్సు వేపొరబ్ లో వున్న ఓ గొప్పగుణం: జలుబు బాధలు కలిగే ముక్కు, గొంతు, గుండె, వీపుల మీద రా
ముక్కుదిబ్బడ ఎంత తొందరగా పోతు... జలుబు బాధ తగ్గి పాప ఎంత హాయిగా వుంటుందో మీ అం
చూడగలరు. విక్సు వేపొరబ్ ప్రత్యేకత ఏమంటే జలుబు బాధలు తీర్చడానికి అది రెండు విధాల


బయట-చర్మం మీద


లోపల-ఊపిరి ద్వారా

1. బయట-చర్మం మీద. విక్సు వేపొరబ్ వెచ్చదనం జలుబు వల్ల కలిగే వంటి నొప్పుల్ని తగ్గిస్తుంది, హాయినిస్తుంది.

2. లోపల-ఊపిరి ద్వారా. విక్సు వేపొరబ్ మందుఆవిరిగా మారుతుంది. ఊపిరి పీల్చినప్పుడల్లా ఈ మందుఆవిరి వంట్లో ప్రవేశించి ముక్కుదిబ్బడను పోగొడుతుంది. గొంతునొప్పిని, గుండెల్లో బరువుని తగ్గిస్తుంది. ఈ విధంగా మీ జలుబు భారాన్ని మాయంచేస్తుంది.

### ప్రత్యేక గమనిక



బాగా గుణం కనబడ్డానికి ముక్కు మీద, గొంతు దగ్గర విక్సు వేపొరబ్ రాయండి. గుండెమీద, వీపు మీద విక్సు వేపొరబ్ బాగా రుద్దండి. జలుబు భారం పూర్తిగా తీరేవరకు విక్సు వేపొరబ్ వాడండి.




## విక్స్ వేపొరబ్-జలుబుబాధలకి ఆధునిక ఔషధం